# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను
సంపాదించుట కేర్పడిన
సచిత్ర మాస పత్రిక

సంపాదకుఁడు :

## డాక్టరు కే. యస్. కేసరి

## GRIHALAKSHMI

సంపుటము ౧౯] డిసెంబరు 1947 [సంచిక ౯






### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్ధసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంథికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.



‘వెన్నెలరేయి’

—శ్రీమతి గోర్ల లక్ష్మీబాయమ్మగారు తీసిన ఫోటో.




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయ కల్యాణీ!

# ప్రత్యేకాంధ్రరాష్ట్రము

37 సం॥ లుగా ఆంధ్రులాశిస్తున్న ఆంధ్రరాష్ట్రము త్వరలో ఏర్పడుననే ఆశలు కనుచూపుమేరలో కన్పిస్తున్నది. నూతనరాజ్యాంగ నిర్మాణసభయే కేంద్రశాసనసభగా కూడిన ప్రథమసమావేశంలోనే భారతయూనియన్ ప్రథమప్రధాని శ్రీ పండితజవహారి లాలు నెహూ్రు "నూతన రాజ్యాంగచట్టంలో ఆంధ్రరాష్ట్రం పేర్కొనబడవచ్చు; అదిఅంగీకృతంకాగానే ఈ నిర్ణయం అమలుజరుగవచ్చు" అన్నారు. "రాజ్యాంగచట్ట నిర్మాణ సభలో నూతనభాషా ప్రయుక్తరాష్ట్రనిర్మాణ ప్రస్తావనలుచేస్తూ—సరిహద్దు నిర్ణయ సంఘాన్ని, లేక సంఘాలను ఈప్రభుత్వం నియమిస్తుంది. ఈ సరిహద్దుసంఘం ఒక సం॥లో తన పని పూర్తిచేయ జాలదనజాలము" అనికూడా వారు అన్నారు. ఈ మాసారంభమున పత్రికాప్రతినిధుల సభలో రాజ్యాంగపరిషదధ్యక్షుడు—బాబూరాజేంద్ర ప్రసాద్‌గారు నూతనరాజ్యాంగచట్టము, ఫిబ్రవరిలోగాని ఏప్రిలులోగాని అంగీకృతమవుననీ, పిదప ఒక సం॥నకు—1949 సం॥రారంభంలో క్రొత్త చట్టాన్ని అనుసరించి ఎన్నికలు జరుగుతాయనీ అనిఉన్నారు. పైహంశాలనుబట్టి 1949 సం॥రారంభంలో జరిగే రాష్ట్రశాసన సభల ఎన్నికలు—ఆంధ్రరాష్ట్రానికి ప్రత్యేకంగా జరుగుతాయనీ, ఆ ఎన్నుకోబడ్డసభ్యుల నుండే మంత్రివర్గ ప్రత్యేకాంధ్రరాష్ట్రాన్ని పరిపాలిస్తుందనీ—స్పష్టం.

గాంధీమహాత్ముడే—కాంగ్రెసు రంగంలో భాషాప్రయుక్త రాష్ట్రసిద్ధాంతాన్ని బాహుళ్యంగా అమలుజరిపింది. అయితే తిలకుమహారాజు ఆశీర్వాదంతో కాంగ్రెసు రాజకీయాలలో ప్రత్యేకాంధ్రరాష్ట్రసంఘం సాధించి, అసలు ఈ సిద్ధాంతాన్ని అందు ప్రవేశపెట్టింది మనవారే. నేడు గాంధీమహాత్ముడు భాషాప్రయుక్తరాష్ట్రములు అచిరకాలములో ఏర్పడి—ఆంగ్లభాషకూడా ఆంగ్లపరిపాలనతోపాటు, అధికారస్థానంనుండి వైదొలగవలెనని తొందరపడుతున్నారు. కావున మహాత్ముని ప్రోద్బలంకూడా ఉండడంచేత త్వరలో ఆంధ్రరాష్ట్రం ఏర్పడడం నిస్సంశయము.

నెహ్రూయున్నూ, మహాత్ముడున్నూ, ఒక్కవిషయం నొక్కిచెప్పారు. స్వాతంత్ర్యంతోపాటు దేశంలో చెలరేగిన స్వార్థపరత్వం—ఇలాంటి ఉత్తమాశయాలను చాటు చేసుకొని ప్రత్యేకతాభావంగా పరిణమించి—వాటినికూడా కలుషీభూతం చేస్తున్నది అన్నారు. కావున అటుప్రభుత్వమును క్రుంగదీయక, ఇటు కాంగ్రెసుసంస్థను మొగమాట పెట్టక—వివాదగ్రస్తమైన విషయాలను దాక్షిణాత్యులు—సమరసభావంతో సమాధాన పడవలయునని గాంధీమహాత్ముని హెచ్చరిక.

నిజమే; ముఖ్యంగా ఆంధ్రతమిళులకు చెన్నపట్నం విషయమై వివాదంగాఉన్న మాట వాస్తవమే. స్థూలవిషయాలన్నీ తమకనుకూలమని తమిళులంటున్నారు. సూక్ష్మ విషయాలుకొన్ని తమకనుకూలమైనవి లేకపోలేదని ఆంధ్రులంటారు. ఒక్కటిమాత్రం వాస్తవం; చెన్నపట్నం ఉభయులమూ అనుభవించడానికి ఉపాయాంతరం వెతుకుదామని బాధ్యతగల ఆంధ్రనాయకులంటున్నా—కాదు; తిరుపతిదాకా మిమ్ము గదుముతాము అని బాధ్యతగల తమిళనాయకులే చెబుతున్నారు. కాని, గాంధీమహాత్ముని ఆజ్ఞ అయితే ఉభయులున్నూ సమాధానానికిరావడం అసాధ్యముగాదు. ఏమంటే, మహాత్మునికెన్నడున్నూ ఆంధ్రులు భృత్యానుభృత్యులే; ఇక తమిళులున్నూ వారికభిమానపాత్రులు. ఉభయులనూ పిలిపించి—ఉభయులవాదనలు తామువిని—"ఇల్లాపొండి" అని చెపితే ఎవరుకాదంటారు? ఈ సూచనను ఆంధ్రమహాసభా స్థాయిసంఘపు వ్యవహారాధ్యక్షులు హరిసర్వోత్తమరావుగారే సూచించినారు. కావున జరుగవచ్చు; జరుగవలెననే ఆశిస్తాము. ఈ సందర్భంలో చెన్నపట్నంలో చిరకాలంగా స్థిరవాసంచేస్తున్న కుటుంబాలకుచెంది ఇంకా తమఇండ్లలో తెలుగేమాట్లాడుతూ-చెన్నపట్నం తెలుగుదనం మాయకుండాచేసిన తెలుగుతల్లులకు తెలుగుజాతిఅంతా జోహారు లర్పిస్తుంది.

త్వరలో ఆంధ్రరాష్ట్ర మేర్పడుననే సంతోషం ఆంధ్రులందరికీసమానమే. అయితే అధికస్య—అది తెలుగు గృహలక్ష్మికి విస్తారం. తానేభాష ఇంట్లోమాట్లాడుతున్నదో, తనబిడ్డ కుగ్గుపాలతో ఏభాష నూరిపోస్తున్నదో, ఆ భాషలో విద్యావిధాన మాసాంతము జరగడము, రాష్ట్రప్రభుత్వ వ్యవహారమంతా ఆ భాషలోనడవడం—స్త్రీలఅభివృద్ధి కెంతైనా మూలమవుతుంది. స్త్రీలఅభివృద్ధి—అంటే—ఆ జాతికే అభివృద్ధి.

# "గృహలక్ష్మి" శరణార్థి సంరక్షక నిధి



దేశమున చెలరేగిన మతవైషమ్యము, దుర్మార్గములు మున్నగువాని ఫలితముగా—లక్షలాదిప్రజలు, పాకీస్థానమువీడి హిందూస్థానమునకు శరణార్థులై వచ్చియున్నారు. వారెల్లరు నిరాధారులై ఆరుబయట—ఢిల్లీ పరిసరములలోను, తూర్పుపంజాబునను నివసిస్తున్నారు. ఉత్తరహిందూస్థానమున సహజమగు పుండువంటి చలి ఇప్పటికే వారి నావరించినదట. స్త్రీలు, గర్భిణులు, బాలింతలు సహా, శిశువులు, వృద్ధులుసహా - ఆ చలికి నలగవలసియున్నారు. వారి సహాయార్థము దుప్పట్లువగైరా పంపవలసినదనియు, అందుకయ్యే ధనమంపుదురనియు, గాంధీ, పటేలు, మున్నగువారందరు విజ్ఞప్తుల చేయుచున్నారు. ఇందుకుత్సాహపడు ఆంధ్ర గృహలక్ష్ములు, గృహస్థులు నెందరో యుందురు. వారి యుత్సాహమును కార్యరూపము దాల్చి తోడ్పడుటకై మేమీ నిధిని ప్రారంభించితిమి. విరివిగా విరాళముల నంపి దీనిని సార్థకమొనర్తురుగాక.

వస్తురూపకముగా బట్టలనే వసూలుచేయుచో—ఆ ప్రదేశమునుండియే సరాసరి పంపుటకీ నిధినుండి సాయమొనర్తుము. కావున గృహలక్ష్ములందరు నీ విషయమున సంఘములుగా నేర్పడియు, వ్యక్తులుగాను కృషిచేయ గోరుచున్నాము.

కే. యన్. కేసరి




శ్రీమతి కె. సూర్యకాంతంగారు

కాశేశ్వరరావుగారి చట్టం; అంటే అప్పుడే అరుపులు బయల్దేరేయి. ఉదాహరణకి
శ్రీ మా. రామచంద్రశాస్త్రిగారి పద్యాలే సాక్షి. (సెప్టంబరు గృహలక్ష్మిలో)

దీనికి కారణమేమిటని చూస్తే అనాదినుంచీవస్తున్న పురుషునిఅధికారం, అహంభావం, యిందులో స్పష్టంగా కనిపిస్తాయి. ఇంట్లో పిల్లలను మందలిస్తూ "దాని మొగుడంటే పడుతుందికాని, నువ్వూ, నేనూ అంటే పడుతుందేమిటీ" అనీ; "కాపరానికెడ్తే ఎలాగా అదవూ ఆజ్ఞా ఉంటుంది. దాన్ని మొగుడే జాగ్రత్తలో పెట్టుకుంటాడనీ" మామూలుగా అంటూనేఉంటారు మనవాళ్లు. అంటే మూడుముళ్లూ ఎవర్తికేనా వేసేస్తే దానిమీద ఆపురుషుడికి సంపూర్ణాధికారం వచ్చేస్తుంది. దానికితోడు భర్తవద్ద అణకువగా ఉండాలనీ, అతని మాట జవదాటకూడదనీ, ఆలా చెయ్యకపోతే పాపంఅనీ, యీ లోకంలో అతడు శారీరకంగానేనా మానసికంగానైనా బాధపెడదాడనీ, ఆకాశవాణీలాగ అనునిమిషం ఆడపిల్లలచెవిలో గింగురుమంటూ ఉంటుంది. అంటే భర్తను సంతోషపెట్టని స్త్రీకి పాతివ్రత్య భంగంవస్తుంది. అంతేకాదు నలుగురిలోనూ తలఎత్తుకుని బ్రతకటమేకష్టం. అంచేత వివాహితస్త్రీ తలవొంపు, అవమానం, అత్తారుపెట్టేబాధ, పుట్టింటివారి యీసడింపులూ పడడానికేనా సిద్ధంఅవాలి; లేకపోతే వ్యక్తిత్వంమరచిపోయి తల్లీ తండ్రి దానవిక్రయ సర్వాధికారాలతో అల్లుడికి తనను యిచ్చేశారని గమనించి, బానిసగా, పాతివ్రత్యగౌరవం, పుణ్యాం సంపాదించుకోవాలి.

ఈవిధంగా భార్యనడుస్తే సంపూర్ణ స్వేచ్ఛననుభవిస్తున్న పురుషుడు దానికనుసన్నల మసుల్తారని కొందరివాదం. అదెన్నటికీకాదు. మనం లోకంలో చూసుకుంటే నాలుగురకాల కాపురములు బాహాటంగా కనిపిస్తాయి. ఒకటి సంసార పక్షంగా యింటికి మొగాడువచ్చేసరికి ప్రత్యేక ఆనందమేమీ లేకుండా, గానుగ

ఎద్దు జీవితంగడుపుతూ నాలుగు చీవాట్లూ; విసుపుముక్కలూ వినిపించేవి. వీటిలోనే కొన్నిచోట్ల ఆడ వాళ్లను కొట్టేవీరులుకూడా ఉంటారు. రెండవరకం. అందమైన భార్యను చూసిసంతోషంతో గడుపుకు పోయేరకాలు కొన్నీ. ఆడదాని నోటికిజడిసి లొంగిపోయి ఉండేవారు కొందరు. మూడవరకం. ఇంటిదగ్గర భార్యనుచూసుకొంటూ పైస్త్రీలతో సంచరించే రసికులూ, యింటిదాన్ని లక్ష్యంచెయ్యకుండా పైతిరుగుళ్లు తిరిగే వీరులూ. ఈరకంవారు తమకుజబ్బులుపట్టుకుంటే, భార్య సహధర్మచారిణిగనుక దానినికూడా వాటిని పంచుకునేటట్లు చేసేవారు. నాలుగోరకం. నీత్రోవ నీది. నాత్రోవ నాది. నీబాగు నీకుతెలుసు. నాబాగు నాకు తెలుసు. అనిరాజీ చేసుకుని 'వీళ్లకి వివాహం అయిందా లేదా ' అనిపించేటట్లు జీవితం గడిపేవారు.

ఇంతకీ వివాహంలో పవిత్రతఉందని కొందరూ, పవిత్రతలేదని కొందరూ వాదించుకుంటూరు. వివాహం అంటేఏమిటీ? ఒకస్త్రీ ఒకపురుషుడు కలిసిమెలసి అన్యోన్యానురాగంతో జీవితాంతంవరకూ కష్టసుఖాలలో ఒకరికొకరు తోడైఉండే బంధంకదా! ఈ అన్యోన్యబంధం లేనిచోట యింకావారిద్దరు భార్యాభర్తలే? వాళ్లది వైవాహిక జీవితమే?

వివాహబంధంలో ఉండే అన్యోన్యత, విశ్వాసం, గౌరవంలేనిచోట ఆ బంధం విడదీయడమే మంచిది. ఇదివారికేకాక, వారిసంతతికికూడా. కాశేశ్వరరావుగారు తమబిల్లులో విడాకులుగురించి ఏర్పర్చే రన్నభాగాలు బాగున్నాయి. కాని తనస్త్రీ వ్యభిచరించడం పురుషుడేలా సహించలేడో, స్త్రీకూడా తనపురుషుడావృత్తి అవలంబిస్తే సహించలేదు. ఇద్దరిమధ్యా ఆత్మీయతఉండదు. పైగా అంటువ్యాధులు. అందుచే భర్త భార్యను కొన్నిసంవత్సరాలు వదలివేసి యింకొకస్త్రీతో ఉన్నయెడల స్త్రీకి విడాకులకు హక్కు ఉంటుంది అనేచోట; భర్త వ్యభిచరించినట్టు భార్యనిరూపించి వెంటనే విడాకులు తీసుకునేందుకు స్త్రీకి హక్కుండాలి. దీనితో వ్యభిచారగుణం వివాహితపురుషులలో తగ్గుతుంది.

అసలు యీ విడాకులంటే యింత భయమెందుకని? చట్టంవచ్చి భార్యాభర్తల్ని బలవంతంగా విడదీసెయ్యదే! భార్యకావాలంటే వేరైపోవడానికిమాత్రం దానికిహక్కుంటుంది. అయితే పూర్వాచారాల్లో కరడుగట్టివచ్చిన మన అలవాట్లూ, మనతత్వం గమనిస్తే మనదేశపుస్త్రీలు, ఆమాత్రం యీమాత్రంలో కాపురంచెడగొట్టుకోరు.

[ విలేఖరుల అభిప్రాయాలకు పత్రికా సంపాదకులు బాధ్యులుకారు—గృ॥ సం ]




శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారు

(ఏప్రిలు సంచిక తరువాయి)

పుట్టితిఁ బుణ్యశీలుడును పూజ్యుఁడు నౌ ద్రుపదేశునింటఁ జే
పట్టితిఁ బాండవాత్మజుల బాహుబలాఢ్యుల ధర్మశీలురన్
బట్టితిఁ గృష్ణుపాదములు భావమునందెడబాయ కెప్పుడున్
కట్టిడియైన నావిధిని కాదని త్రోసిరె ఒక్కరేనియున్?

పురపురఁబొక్కు నామనము; భూరిబలుం డనిలాత్మజుండు, శం
కరునని గెల్చినట్టి భుజగర్వయుతుండగు నింద్రుపట్టి, యీ
కరణిని వంటయిండ్లకడ, కాంతల పొంతను, నృత్యశాలలన్
దిరుగుచు నున్నవారు; విధి దేనినిఁ జేయఁగ నీయదక్కటా!

పాండవ ముఖ్యుఁ డుత్తముఁ డపారకృపామతి ధర్మవేది యు
ద్దండతఁ జూదమాడుట విధాతృకృతంబొకొ యేమొయింత; లే
కుండిన పాపకార్యవిముఖుండు గణింపక సర్వధారుణీ
ఖండము నెల్లనోడి కులకాంతను సైతము పందె మొడ్డునే?

ఎక్కడి ధర్మమో, యితని కెందుకు? ద్రోహి, యసూయజేసి య
మ్మక్క! విసంబువెట్టెను బ్రియానుజు భీమునిఁజంప; దానికే
పొక్కమనంబు; లక్కయిలు బూడిద సేసిన చేత యెన్నరా
దక్కట; యేటి యక్కటిక మాతనిపై నిక ధర్మరాజుకున్!

నరపతి కేల ధర్మమననంబు? సమస్తము రాజనీతి యం
దురుగద; ధర్మకార్యములతోడ జయించుటకల్ల; రాజశే
ఖరులు! ప్రతాపవహ్ని నరికాండములం దహియించి యీవసుం
ధరను జయించి పాలన మొనర్చిన వృద్ధపతివ్రతల్ గదా!

ఖలుడు సుయోధనుండు మముఁ గారియవెట్టు తలంపుతో వన
స్థలికిని ఘోష యాత్రయను తప్పుడు కారణమూని వచ్చె; పె
బలియుఁడు చిత్రసేనునకు పట్టువడంగఁ దొలంగనీక త
మ్ములనని కంపి వానినిఁ జమూయుతుఁగా విడిపింప నేటికిన్?

తనపినతండ్రి పుత్రుల వదాన్యుల తమ్ముల నిత్యసాధువ
ర్తనుల వధింపఁ బూనిన దురాత్ముఁడు; వానికి మేలుసేయరా
దనిమెడినీతి దామెఱుఁగరా; వినరా మును రాజులెల్ల సే
సిన బహుధర్మపాలనవిశేషము లించుక పాండుపుత్రకుల్.

తెలిసియుఁ జేసె నీపని యుధిష్ఠిరుఁ; డావను నూరి త్రాగిన
ట్టులు దహియించు గర్భము కదుర్; గడుదైన్యముదోపఁ నిట్టి సే
తల ఫలితమ్ముగా నతని తమ్ములజేయ పరాక్రమప్రభా
కలితులు పేదబానిసలకైవడి కాలము ద్రోయుటేగదా?

క్షమయును క్షాత్రము రెంటిని
సమముగ జూడంగ వలయు క్షత్రియుఁ డెపుడున్
శమనసుతుండిది యెరుగఁ డో
శమనంబున లఘుత క్షత్రజాతునకనుచున్.

సమాప్తం



కల్పిక :

# గృహలక్ష్మి

శ్రీమతి గొర్లె లక్ష్మీబాయమ్మగారు

దేశాన్ని ఉద్ధరించేటట్టు అరుణోదయ-రాగంలో కోడికూతతో శ్రుతికలిపి ఆలాపించే 'పెంకిపిల్ల' లీల మారాములతో ఉదయం ఆరంభమయింది. 'సూర్యప్రభ' సంపూర్ణంగా చూస్తేగాని మంచంమీదినుండి లేవనిభర్తను విడిచిపెట్టి బాలలను బడికిపంపే యత్నంలో మునిగిపోయి, వారివిజ్ఞానాన్ని పెంపొందించే సచిత్రపత్రికలు చూపించింది. 'బాల'శిక్ష పూర్తిగాని చిట్టిని 'బాలబంధు'తో తృప్తి పరచి, వాళ్ల 'వినోదా'నికి ఎంతైనా తోడ్ప డుతూ, 'ప్రజాబంధు'లోని సంగీతాన్ని ఆనందంతో వీణమీద సాధనంచేస్తూవున్న 'వాణి'ని కాలంకాగానే భర్తరాకకు ఎదురు తెన్నులు పరికిస్తూ, పిల్లలను జ్ఞానాభివృద్ధికి 'కథాకేళు'ల్లో విహరింపచేస్తూ, అ-ఆ, ఉ-ఊలతో అందరినీ కలాయిస్తూవున్న సీతి పిల్లకు 'చందమామ' చూపుతూవుంది. అందులోనిఘనత తానిదివరకే తెలిసికన్నట్లు అటుచూడక చిన్నక్క జుత్తులాగి ఏడి పిస్తూన్న బొజ్జినివారించి, 'సమత,' ఓర్మి కలిగి ఆనందముతోవున్న అమ్మదగ్గరకు ఆటవిడిచి బాటుతిప్పుకుంటూ వచ్చేరాని ఇంగిలీషు ముక్కల్ని పెళ పెళలాడిస్తూ తానువిన్న కాశ్మీర కల్లోలాల్ని నైజాము దురంతాల్ని కన్నతల్లికి వినిపిస్తూ ఆవేశంతో నాయకుడనై, ఆంధ్రవీరుడనై భారతమాత హృదయాందోళనం అంతంచేసి, 'ఆంధ్రజ్యోతి'ని వెలిగిస్తానంటూ బోరవిరుచుకు ఎదుట నిలుచున్నకుమారుని ఆనందబాష్పాలతో కౌగలించుకొని, ముద్దాడింది. . . .



భర్తతో పిల్లలనందరినీ 'తెలుగు సినీమా'కు తీసుకువెళ్లి రాజనరేంద్రుని ముసలి ముచ్చట్లకు నవ్వుతూ, 'చిత్రాంగి' చమత్కారానికి అచ్చెరవుపోతూ, సారంగధరుని త్యాగానికీ, మాతృభక్తికీ కంటనీరుపెట్టిన పెద్దపిల్లను బుజ్జగిస్తూ ఇంటికివచ్చి, పిల్లలను నిద్రపుచ్చి, నవోదయానికి ఎదురుచూస్తూ 'భారతి'ని స్మరిస్తూ పిల్లలమధ్య మేనువాల్చిన 'ఆంధ్రమహిళ' జీవితమే జీవితము. ఆమెయే ఆదర్శ 'గృహలక్ష్మి'.



'ఏమిటది!'

—శ్రీమతి గోర్ల లక్ష్మీబాయమ్మగారు తీసిన ఫోటో.

# "గోపబాల"





శిరమునపింఛంబు చెక్కిలిహాసంబు
మెఱయుచు మొలకెత్తి మేళవింప
కస్తూరితిలకంబు కమ్మతావుల జిమ్మ
కర్ణికారతనాలు కాంతినీన
మెడలోని హారంపు మేలైనముత్యముల్
తులసిమాలలనుండి తొంగిచూడ
భుజముపై చేలంబు భుజకీర్తులున్ గూడి
రారాజఠీవి తోరముగ దెలుప
ముంజేతికంకణాల్ ముమ్మరమ్ముగ మ్రోయ
పిల్లగ్రోవి రవంబు వెల్లివిరియ
బంగరుమొలనూలు - పట్టుపుట్టంబును
నల్లనిమేనిపై - నాట్యమాడ

శాంతి చేకూర్చి సతతంబు సౌఖ్యవీధి
నోలలాడంగజేయుచు నుర్విజనుల
ప్రియముతోడనుజూచెడు ప్రేమరూప
గోపికాలోల శ్రీకృష్ణ గోపబాల.



"దీక్షి - దేవి"

# విప్లవవీరులు వృద్ధిపొందాలంటే?



ఏ దేశమైనా చైతన్యవంతంగా, బలవత్తరంగా, శత్రునిర్భేద్యంగా ఉన్నదిఅంటే అది ఆ దేశపు స్త్రీలవలన వచ్చిందనుకోవాలి. స్త్రీల మనస్తత్వాన్ని, నైతికతత్వాన్నిబట్టే ఆ దేశస్థితిగతులు ఉంటూ ఉంటాయి. స్త్రీలు వ్యభిచారులయ్యేట్లయితే సంతతి బలహీనమైపోతుంది. వారిలో చైతన్యం, పౌరుషం నశించిపోతుంది. పిల్లలకు తండ్రిలక్షణాలకంటే తల్లిలక్షణాలే ఎక్కువగా అబ్బుతై. దీనికి కారణమేమిటంటే శిశువు నవమాసాలు తల్లిగర్భంలోఉండి తల్లిమనస్తత్వాన్ని జీర్ణింపజేసుకుంటుంది. భూపతనమైనతర్వాత కొంతకాలంవరకు తల్లిపాలతో పెరగాలి. అందుకనే చిన్నపిల్లలు సాధారణంగా తండ్రితోకంటేతల్లితో ఎక్కువచనువుగాఉంటారు. తల్లిపోలికలెక్కువగా పిల్లలలో కనిపిస్తూఉంటై. ఇది అందరికి తెలిసిన విషయమే. శిశువుకు ఏ విధమైన జబ్బురాకుండా ఉండటానికని తల్లిపత్యంచెయ్యాలి. కాని తండ్రికా విధిలేదు. దీనినిబట్టి శిశువుయొక్క పరిస్థితిఅంతా తల్లినిబట్టే నడుస్తుందని తేలుతోంది.

కనుక తల్లులు వారివారిబిడ్డలనుగురించి తగుజాగ్రత్తను తీసుకోవాలి. ముఖ్యంగాఇవి విప్లవదినాలు గనుక దాన్నిగురించే రెండుమాటలుచెబుతాను.

ప్రథమప్రపంచ సంగ్రామంలోను, అంతకుముందు నెపోలియన్ యుద్ధాలలోను ఫ్రెంచివారు గొప్ప పరాక్రమవంతులనిప్రతీతి. ప్రపంచసంగ్రామంలో యుద్ధకారణంగా అనేక వేలమందిపురుషులు చనిపోయారు. అందుచేత దేశంలో స్త్రీలసంఖ్యహెచ్చింది, పురుషులసంఖ్య చాలావరకుతగ్గింది. అందుచేత ఫ్రెంచిదేశానికి నీగ్రోలుమున్నగు ఇతర జాతుల పురుషుల్ని దిగుమతిచేసుకోవలసి వచ్చిందట! వారివల్లకల్గిన సంతానము (cross breed) చైతన్యశూన్యంగా చప్పచప్పగాఉండి ద్వితీయప్రపంచ సంగ్రామంలో జర్మనీచేత 18 రోజుల్లో ఓడించబడింది. దీనికి స్త్రీలే మూలకారణమని చెప్పటంలో సందేహమేమైనా ఉన్నదా?

రచన:
శ్రీమతి యడవల్లి
శ్యామలాదేవిగారు

మనదేశంలో పూర్వం స్త్రీలు వీరమాతలుకావాలని కోరుకునేవారు. కొందరు స్వయంగా రణభూమిలోకి అడుగుపెట్టి అపూర్వవిజయాల్నిపొందారు; తమశక్తి సామర్థ్యాల్ని ప్రదర్శించిన ఝాన్సీ లక్ష్మీబాయి, రుద్రమాంబల్లాంటి పౌరుషనారీమణులే ఇందుకు తార్కాణము.

ఈ ఇరవయ్యో శతాబ్దంలో అలా స్త్రీలు యుద్ధరంగాల్లోకివెళ్లటం మనలోహేయంకావచ్చు. కాని అపరోక్షంగావారు నిర్వహించాలిసిన విధిచాలాఉంది. ప్రతిస్త్రీగూడా తాను వీరమాతకావాలని కోరుకోవాలి. జిజియాబాయికి అలాంటి సంకల్పముండటంచేతనేగదూ మనకు శివాజిలాంటి పరాక్రమశాలి, హిందూమతోద్ధారకుడు, నిష్కల్మషదేశభక్తుడు లభించింది!

ఈవిషయాన్ని మనసోదరీమణులు మరిచిపోగూడదు. జిజియాబాయి శివాజీకి ఉగ్గుపాలతోస్వాతంత్ర్య మంత్రాన్ని బోధించినట్లుగా మనస్త్రీలుగూడా వారిసంతానానికి చిన్నప్పటినించీ మనదేశస్థితిగతుల్ని తెలుపుతూ, వారిలో దేశభక్తిని పెంపొందించి వాళ్ళను విప్లవవీరులుగా తయారుచెయ్యాలి. 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపిగరీయసీ' అన్నారుపెద్దలు. ఆ మాటల్ని మనం మరువగూడదు. మనకు స్వరాజ్యం అంటే మనదేశాన్ని మనము పాలించుకోవాలన్నమాట. మనప్రజలు బలహీనులైతే మనదేశం మళ్ళీ పరాయి పాలనలోకి పోవాలిసివస్తుంది. అందుకనిమనం ముందుగాజాగ్రత్తపడాలి. ఇదే నేను ప్రతిభారతనారీమణిని అర్థించేది.

# స్త్రీ విద్య

రచన: * శ్రీమతి
కె. సుందరాబాయిగారు




విద్యయనగా జ్ఞానము. యీవిద్య అనేకవిధములుగా నున్నయది. వాటిలో కళాశాలవిద్య, వైద్యవిద్య, సంగీతవిద్య యివి ముఖ్యములు. యివి స్త్రీకి గృహకృత్య నిర్వహణమునకు ముఖ్యముగ వుపయోగకరమైనవి. వైద్యవిద్య, సంగీతవిద్య, స్త్రీపుట్టుకతో వంశపారంపర్యంగా వుంటున్నవి. అయితే కళాశాలవిద్య స్కూళ్లకుపోయి చదువవలశినదే. ఇట్లు కళాశాలవిద్య నేర్చుకొని తుదకైనా యొకరిసహాయము పొందవలసినదే గాని పురుషునికివలె స్వాతంత్రియము దొరకదు. వైద్యవిద్య అయితేనో యెటువంటి వారినిన్ని లోపర్చుకోవచ్చును. జనసమూహము యావత్తున్న "డాక్టరు మంచివారు, శ్రద్ధగా చూస్తారన్న"మాటలోనే బెల్లమునకు చీమలుపట్టినట్లు గుమిగూడుదురు. ద్రవ్య సంపాదనకూడును, ప్రఖ్యాతిపొందవచ్చును. సంగీతవిద్య యిదియు ప్రజాకర్షణకు మ్యాత్రము యీ కర్ణాంబి పాటకచ్చేరి అనగానే పెక్కుమంది పనులుపాట్లు విడిచిపెట్టి పోయివచ్చెదరు. ఇదియుగాక యెటువంటి వ్యసనముననైన సంగీతము నశింపచేయును. ఇప్పుడు మనయెదుట సినీమాలో యెందరో లక్ష్యాంతరరూపాయలు సంపాదించినారు. గనుక స్త్రీకి యావత్తు విద్యకన్నను సంగీతవిద్య మొదటిది. యీ విద్య స్త్రీ సంసారిగా వున్న పలుతెఱంగుల రాణించును. అధిక గౌరవము. స్త్రీ సంసారమన్న: వృక్షము తల్లి దండ్రులు; కొమ్మలు మొగబిడ్డలు; ఆకులే ఆడబిడ్డలు; పూలుపండ్లు కోడండ్లు; వీటినిచూచి యానందించువారు- తల్లిదండ్రులు, అత్తమామలు. ఇటువంటి స్త్రీలకు పూర్వాచార పద్ధతులకు విరుద్ధముగా మొగవారివలె అధికకళాశాలవిద్యలిచ్చి తల్లిదండ్రులు పెంపు చేసిన స్వాతంత్రియములేక పలువిధముల కష్టములపాలు కాబడవలయును. అట్లు అధిక విద్యనేర్చినను, వైద్య, సంగీతవిద్యలుతప్ప యింక యేవిద్యయందు స్త్రీలకు సుఖముండదు. గనుక స్త్రీలు అధికకళాశాలవిద్యలకుపోక మిగిత గృహకృత్యములకున్ను, తన సంసార శిశుపోషణ మొదలైనవాటిని నిర్వహించుకొనుటయందును నేర్పరులై పెనిమిటిని ఆనంద పెట్టి వారెనియెంత సుఖపెట్టిన అంత ఆనందముగా సంసారము పెంపుచేయనచ్చునని యే నా అభిప్రాయము. స్త్రీ వైద్యవిద్య, సంగీతవిద్య తప్ప యితరవిద్యలు యేమియు ప్రయోజనము లేదనియు నా యభిప్రాయము.

# వేదకాలపునాటి స్త్రీలు




రాజా రంగయ్యప్పారావు బహద్దరు. ఎం.ఎ.,
ఉయ్యూరు కుమారరాజా


## స్త్రీల హక్కులు:

స్త్రీలకు ఆస్తివిషయములోకూడా ఇతరవిషయాల్లో లాగే కొంత అన్యాయం జరిగింది. ఆస్తిమీద హక్కు భర్తకేగాని భార్యకులేదు. ఇంతేగాదు, భర్త చనిపోయినప్పుడుగూడా, భర్తఆస్తిని ఆమెఅనుభవించ వలసినదేగాని దానం చేయడానికిగాని అమ్మడానికిగాని హక్కులేదు. ఆమెకు కుమారుడున్నట్లయితే కుమారునకు ఆస్తి పోతుంది. లేకపోతే భర్త అన్నదమ్ములకుగాని లేక సగోత్రీకుల్లో దగ్గరవారికిగాని పోతుంది. స్త్రీలను ఎల్లప్పుడుకూడా పురుషుల్లో మైనార్టీ వెళ్లనివారిని చూచినట్లుగా చూచేవారు. ఈ విషయంలో ఇప్పుడు చేయబడ్డమార్పులు చాలా ప్రశంసనీయమయినవి.

స్త్రీ కుమార్తెగాను, భార్యగాను, తల్లిగాను, వితంతువుగాను పరిశీలించి ఏమేమి హక్కులు గలవో చూడవలసిఉంటుంది.

### కుమార్తె:

పూర్వపు రోజుల్లో వివాహముగాని కుమార్తెలకు కుమారులకు తండ్రిద్వారా సంక్రమించిన ఆస్తిలో నాల్గవవంతువరకు హక్కుంది. అంటే ఒకకుటుంబములో కొంతమంది మగపిల్లలు ఆడపిల్లలు ఉన్నట్లయితే ప్రతిమగవాడు తనఆస్తిలోనుండి నాల్గవవంతు ఆడపిల్లలకి ఇవ్వాలిఅని. కొంతమంది వ్యాఖ్యాతలు నాల్గవవంతు ఇవ్వనక్కరలేదు అన్నారు. పెండ్లిఖర్చులు మాత్రం చాలుఅన్నారు. కాని దీన్ని అందరు ఒప్పుకోలేదు. ఈరోజుల్లో కట్నాలు ఇవ్వవలసివచ్చిదంటే ఆస్తిలో నాల్గవవంతేగాక పూర్తి ఆస్తి అమ్మవలసి వస్తుంది. ఈ దురభ్యాసం మానిపించేభారం పురుషులమీదఉంది. తల్లి ఆస్తివిషయంలో మాత్రం పూర్తిగా పెండ్లికాని కుమార్తెలకే హక్కుందని మనువు శాసించాడు. ఈతల్లివల్ల వచ్చిన ఆస్తికి "స్త్రీధనమని" పేరు. ముందు అవివాహితలగు కుమార్తెలు, అందరకు వివాహమయితే వివాహమయినకుమార్తెలలో బీదవారికి, హక్కుముందు, బీదవాళ్లుతర్వాతధనవంతులకు. ఇదిస్త్రీధనం విషయంకాదు. తండ్రి ఆస్తివిషయమే. మితాక్షరుడు 'తండ్రితర్వాత కుమారులులేని పక్షంలో, కుమార్తెలకు హక్కుందని చెప్పాడు. మగపిల్లలు లేనప్పుడు ఆస్తి ఆడపిల్లలకు వెళ్లుతుంది. ఎందుకంటే మనుమలు తాతగారికి ఉత్తర క్రియలు చేస్తారు కాబట్టి. అయితే ఆస్తి కుమార్తెలకు వెళ్లిన తర్వాత ఒకవేళ కుమార్తెకు కుమారులు లేక పోయినా తిరిగి ఆస్తి తీసుకోవడానికి ఎవరికీ హక్కులేదు.

## భార్యగా, వితంతువుగా :

భార్యకు ఆస్తిమీద ఏమి హక్కులేనట్లుగా మనువుచేత, శుక్రునిచేత చెప్పబడింది. స్త్రీలకు స్త్రీధనం మీద మాత్రమే హక్కుంది. భర్తఆస్తిమీద ఆమెకుగల హక్కుపోషణమాత్రానికి, ఇంట్లో ఉండడానికి మాత్రమే.

## వి త ం తు వు :

వితంతువుకు హక్కులు ఆర్యులలో ఎక్కువగానే యివ్వబడ్డాయి. భర్త చనిపోయినప్పుడు భార్యకు పూర్తైన హక్కులు గలవు. భార్య అర్ధాంగి కాబట్టి భర్త తర్వాత అర్ధాంగికే ఆస్తిపై హక్కున్నది. మగపిల్లలున్నట్లయితే భర్తఆస్తి వారితో సమానంగా పంచుకోవాలి. ఒక అవిభాజ్యపు కుటుంబములో కొంతమంది కుమారు లున్నట్లయితే ఆస్తిపంచుకో వలసి వచ్చినప్పుడు, కుమారులలో ఒకరు చనిపోయినట్లయితే ఆస్తి మిగతా కుమారులందరికి చెందుతుందిగాని, చనిపోయిన కుమారుని భార్యకు చెందదు. భాగా లయిపోయిన తర్వాత చనిపోయినట్లయితే, చనిపోయిన వాని భార్యకు వెళ్లుతుందిగాని అన్నదమ్ములకు వెళ్లదు. ఈవిధంగా మితాక్షరుడు శాసించాడు.

## త ల్లి :

ప్రతితల్లి భార్యాయే. భర్తజీవితకాలంలో ఆమె స్త్రీధనంమీదతప్ప తదితరమైన హక్కులు ఏమి ఆమెకు లేవు. భర్త చనిపోతే ఆమె హక్కులు వితంతు హక్కులే. కుమారుడుగాని, కుమార్తెగాని పెండ్లి కాకుండా చనిపోయినట్లయితే వారి ఆస్తి తల్లికే చెందుతుంది. కాబట్టి ఈ ఆస్తివిషయాల్లో బాగా పరిశీలించి నట్లయితే ఇప్పటికంటే అప్పటి పరిస్థితులే చాలా బాగున్నట్లు కనబడుతుంది.

## స్త్రీ ధ న ం :

నారదుడు, విష్ణువు, ఆపస్తంబుడు, వ్యాసుడు, దేవలుడు అందరూ కూడా స్త్రీలకు స్వంత ఆస్తి ఉంచుకొనుటకు హక్కు కలదని చెప్పారు. విజ్ఞానేశ్వరుడు స్త్రీధనాన్ని ఈవిధంగా అన్నాడు. "తండ్రి చేత ఇవ్వబడ్డ ఆస్తిగాని, తల్లిచేత ఇవ్వబడ్డ ఆస్తిగాని, భర్తచేత ఇవ్వబడ్డ ఆస్తిగాని, తమ్మునిచేత, అన్నచేత ఇవ్వబడ్డ ఆస్తిగాని లేక భర్త ఇంకొక భార్యను వివాహ మాడేటప్పుడు తనకు యిచ్చిన బహుమతిగాని," లేక మామగారు, అత్తగారుగాని తదితరు లెవరైనా ఇచ్చిన ఆస్తిగాని స్త్రీధనమని పిలువ బడుతుంది. ఈ ఆస్తి మీద ఆమెకే తప్ప భర్తకు హక్కు లేదు. పెండ్లప్పుడు అగ్నిసాక్షిగా ఇచ్చిన ఆస్తికి "అధ్యాగ్నికం" అని, ఊరేగింపప్పుడు ఇచ్చింది "అధ్యవాహనికం" అని, భర్తకు యింకొక వివాహమప్పుడు ఇచ్చే ఆస్తి "అదివేదనికం" అని, యితర సమయాలలో ఎవరైన యిచ్చిన బహుమతి "అన్వాధేయం" అనియు అనబడుతుంది. ఈ స్త్రీధనం పిల్లలు లేకపోయినట్లయితే భర్తకే వెళ్లుకుంది, భర్తలేకపోతే సగోత్రీకులకు వెళ్లుతుంది. పిల్లలున్నట్లయితే ఆడపిల్లలకు అందులోకూడా ముందు పెండ్లిగానివారికి ఆస్తి సంక్రమిస్తుంది. ఆడపిల్లలు, ఆడపిల్లల కొడుకులు లేకపోతే ఆమె స్వంతకుమారులకే ఆస్తిపోతుంది. స్త్రీధనంమీద ఎవరికి హక్కులేదు. కాని ఏదైనా అవాంతరము వచ్చినప్పుడు, కొన్నికొన్నిసమయాలలో భర్త యీధనాన్ని ఖర్చుపెట్టవచ్చు. మళ్లీ తిరిగి యీయనక్కరలేదు. ఇతర సమయాల్లో ఖర్చు పెట్టినట్లయితే మళ్లీతిరిగి యియ్యవలెనని మితాక్షరుడు చెప్పాడు. ఈ స్త్రీధనం విషయంలో అనేక వ్యాఖ్యాతలు, స్మృతికర్తలు, అనేక విధాలుగా చెప్పారు.

## పూర్వపు రోజులలో స్త్రీలకు ఎంతవరకు స్వాతంత్ర్యము ఉండేది?

వేదకాలంలో స్త్రీలకు బయటికి వెళ్ళుటకు, స్వేచ్ఛగా తిరుగుటకు వీలుండేది. ఇప్పటిలాగ ఇంటి నాలుగు గోడలమధ్య బంధింపబడి ఉండలేదు. ఇంట్లోవారుండడానికి వేరేగదులు, వేరేభాగమున్నా, పండుగలప్పుడు తదితర ఉత్సవ సమయాల్లో అందరితో కలసి చూడడానికి తిరగడానికి సంతోషించడానికి వీలుండేది. అంతేగాక, స్త్రీలు సంతలు మొదయిన చోట్లకు కూడా వెళ్లుచున్నట్లుగా ఋగ్వేదములో చెప్పబడింది. పెద్ద సారస్వత సభలకు కూడా వెళ్లి సారస్వత గోష్ఠిని పాల్గొని, ఆనందించినట్లు కనబడుతుంది. విజ్ఞానయాత్రలకు వెళ్ళినట్లుగా కనిపిస్తున్నది. పర్వతాలు ఎక్కేవారు; పండ్లు పూవ్వులు కోసేవారు, శుభ్రమయిన గాలిని పీల్చేవారు. ఆరోగ్యవంతులయి ఉండేవారు. పర్వతాలు ఎక్కడం చాలా కష్టం. ఇప్పటి స్త్రీలలో పర్వతాలు ఎక్కినవారు ఎంతమంది ఉంటారో? సరోవరాల్లో కొలనులలో జలక్రీడ సలిపి, ఈత గొట్టేవారు. మన పూర్వపు పుస్తకాలు ఏవితీసుకున్నా స్త్రీలు ఎక్కువగా ఉద్యానవనాల్లో తిరుగుతున్నట్లు, జలక్రీడలు చేస్తున్నట్లు కనబడుతుంది. ఆడవారు తిరగడమేగాక భార్యభర్తలుకూడా సాయంత్రం ఉద్యానవనాల్లో విహారంచేస్తున్నట్లు కొలనులలో జలక్రీడలాడుతున్నట్లు తెలుస్తుంది. వేదకాలములో స్త్రీలు నాట్యంకూడా చేస్తున్నట్లుఉంది. రామాయణంలో అయోధ్యానగర వర్ణనలో నాటకశాలలు ఉన్నట్లుగా చెప్పబడింది. వీటిలోకి ఆడవారు కూడా విరివిగా వెళ్లుతున్నట్లు తెలుస్తుంది. మహాభారత కాలములో కూడా స్త్రీలు చాలమట్టుకు స్వేచ్ఛా జీవనం గడిపినట్లుగాఉంది. ద్రోణాచార్యులవారు తనశిష్యుల ప్రజ్ఞను వెల్లడిచేయుడానికి ఒకగొప్ప సభ జరిపి అందరిని ఆహ్వానించి నప్పుడు ఆసభలోనికి గాంధారి, కుంతి మొదలైన స్త్రీలు కూడా వచ్చిచూచి ఆనందించారు. కాని క్రమ క్రమంగా స్త్రీల స్వేచ్ఛ అరికట్ట బడింది వారు ఇంటిపనులు మాత్రమే చేయాలని, బయటికివెళ్లితే తప్పని, సిద్ధాంతాలు బయలుదేరాయి, ఈ అలవాటులు విదేశీయులు వచ్చి దేశాన్ని జయించిన తర్వాత మరింత దృఢమయి పోయ్యాయి. అవివాహితలయిన బాలికలు, ఇల్లువెలువడ రాదని, వారు ప్రతి విషయములో జాగ్రత్తగా నడుచుకోవాలని, ఆంక్షలు వచ్చాయి. వారెప్పుడు సిగ్గుకలిగి ఉండాలి, ఎక్కువగా మాట్లాడకూడదు. పరదాలో ఉండి పురుషులకు కనబడరాదు. బయటికి వెళ్లనేకూడదు. ఒకవేళ వెళ్లినా, భర్త ఆజ్ఞానుసారంగా వెళ్లాలి. బయటికివెళితే పదిహేను పదహారుఏండ్లువచ్చిన పిల్లలుకూడా యాభైసంవత్సరాల ముసలమ్మలాగా నెమ్మదిగా నడవాలి. ఎవ్వరితోనూ మాట్లాడకూడదు సరేగదా, ఎవరివంకా చూడగూడదు.

వివాహవిషయంలోకూడా స్వతంత్రం స్త్రీలకుఉండేది. స్వయంవరం అనేది మనమందరం విన్నదే. పూర్వం అనేకమంది స్త్రీలు భర్తలిని స్వయంగా వరించినట్లుగాఉంది. కొంతమంది స్త్రీలు బలవంతులయిన వారిని, వీరుల్ని వివాహంచేసుకున్నారు. కొంతమంది వారి రూపాన్నిచూచి వరించేవారు. సావిత్రి వివాహ కాలము సంప్రాప్తించినపుడు భర్తను వెతకుటకు అనేక చోట్లతిరిగింది. ఇట్లు తిరగడానికి వెంట సైన్యాన్ని, కావలసిన పరికరాలిని, ఇచ్చి ఆమెతండ్రియగు అశ్వపతి మహారాజు ఆమెనుపంపాడు. ఆమెవెళ్లి, తల్లిదండ్రులకు సేవజేసే సత్యవంతుని వరించింది. ఎందుకు, అతని తల్లిదండ్రులయెడగల భక్తినిచూచిగాని, ధనమును చూచిగాదు. అతడు అల్పాయుష్యవంతుడని తెలిసికూడా ఆయన్నే వివాహమాడింది.

సీత—పెద్దధనస్సును తేలికగా ఎడమచేత్తో ఎత్తేదట. ఆధనుస్సు ఎక్కువ బరువయింది బలవత్తరమయిందీని. అందువలన జనకమహారాజు ఆధనుస్సు ఎక్కుపెట్టినవారికే తనకుమార్తెనిచ్చి వివాహముచేస్తానని ప్రకటించాడు. అనేకమంది ప్రయత్నంచేసి విఫలులయ్యారు. చివరకు శ్రీరాములవారు దానిని ఎక్కుపెట్టడమేగాక విరిచేశారు. అప్పుడే సీత ఆయనను వరించింది. సుభద్ర—విషయంలో మనం పరిశీలించినట్లయితే స్త్రీలకు ఎంతస్వాతంత్ర్యం ఉండేదో తెలుస్తుంది. ఆమె అన్నగారయిన బలరామునికి ఇష్టములేకపోయినా, అర్జునుని వివాహమాడింది. రుక్మిణి—కృష్ణునకు ఉత్తరం వ్రాసి, ఆయనచే హరింపబడింది. ఈ విషయంలో పెద్ద యుద్ధముకూడా జరిగింది. ఈ యుద్ధములో శ్రీ కృష్ణుడు రుక్మిణి అన్నను, శిశుపాలుణ్ణి జయించాడు. శకుంతల—దుష్యంతుని అరణ్యంలో కలిసికొని గాంధర్వవివాహము చేసికొన్నప్పుడు కణ్వమహాముని "నీవుచేసినపని చాలా ఉత్తమమయిన"దని చెప్పాడు. బంధువులచేగాని, తల్లిదండ్రులచేగాని, ఏర్పాటుచేయబడ్డ వివాహము శ్రేష్ఠమయినదేగాని, పెండ్లికొమార్తెచేత పెండ్లికొమారునిచేత స్వయంగానే యేర్పాటుచేసుకోబడ్డ వివాహము శ్రేష్ఠతరము అని చెప్పబడింది కనుక ఈ వివాహవిషయంలో ఎంత స్వాతంత్ర్యముందో చూడండి. ఇప్పుడుకూడా విజ్ఞానవంతులు తమ కుమార్తెల వివాహవిషయంలో వారిని అడగందే వివాహంచేయడంలేదు. పిల్లయిష్టం తెలిసికోందే చేయడం ఇంకా చాలచోట్లఉంది. ఇది పూర్తిగా నశించాలి. అంటే ఆడపిల్లలు విజ్ఞానవంతులయి, వారిహక్కులను వారు తెలిసికొన్నవారై యుండాలి.

(సశేషము)

# నా చిన్ననాటి ముచ్చట్లు

కే. యస్. కేసరి



## పుష్పవనం

**(Ornamental Flower Garden)**

**("Man is very near to God in a garden than any where else on earth")** అనగా మానవుడు అన్నిటకంటెను పుష్పవనమున ఈశ్వరసాన్నిధ్యమునకు చాలదగ్గరగ నుండగలడని. మనము సాధారణముగ ఇంటితోటలలో భక్షణపదార్థములను మాత్రము వేసుకొని పెంచి వాటి ఫలములను అనుభవించుచుందుము. అయితే పుష్పవనమునుగూడ మరువరాదు. పుష్పవనమున గృహనిర్మాణమును నిర్మించుకొని నివసించినమనుజుడు హాయిగ దీర్ఘజీవితమును సంపాదించుకొనగలడు. ఈ పూదోట నిర్మాణమునకు ముఖ్యముగ స్త్రీలు దగినవారు. స్త్రీలకు పుష్పములమీదయుండు ప్రేమ వెలగల నగలమీదను చీరలమీదను కూడ యుండదు. ఈ విషయము ప్రతిస్త్రీకిని దెలియును.

పూదోట వినోదమునకేగాక ఆరోగ్యభాగ్యమునకును మానసికవ్యాధులకును మంచిమందు. ప్రాతఃకాలమునలేచి సుగంధపుష్పముల చెట్లనడుమను లతాగృహములలోను సంచరించునపుడు వీచు ఆ మందమారుతమువలన గలుగు ఆ బ్రహ్మానందమును వర్ణించుటకు యెవరితరము ? సుగంధపుష్పరాజమును ఆఘ్రాణించుటవలన కలుగు 'మనోహర' మను మందు మనోవ్యాకులములను మాయముచేయును. పూదోటలో పూదేనియకు విచ్చల విడిగ విహరించుభృంగముల మధురగీతములు వీనులకు విందొనర్చుచుండును. తేనెటీగలు పూదేనియను త్రాగి తేనెగూటినికట్టుకొను చిత్రమునుచూచి సంతోషింపవచ్చును. రంగు పక్షులు రామచిలుకలు ఫలవృక్షములకు తోటలో పాకులాడుట చూడవచ్చును. వంటరిగ నుండునపుడు పూలచెట్టువద్దకూర్చుని దానికి శుశ్రూషచేయుచు స్నేహమును సంపాదించు కొని కాలమును శాంతముగ గడపవచ్చును. అనేకులు ఆత్మశాంతికై ఆరామ[illegible] క్షేత్రముల నాశించెదరు. వేయేల ఆరామమునకుమించిన ఆత్మబంధువు వేరుగనుండరని చెప్పవచ్చును.

కావుననే మహర్షులుకూడా ఇహలోకసౌఖ్యములవిడిచి అడవులలో తపస్సుచేసు కొనుచున్నను పుష్పవనమును కేవలము దయాహృదయులై పెంచుదురు. బహుశా ఆ పుష్పవనము శోభ—వారి శమదమములను పెంపొందించుచుండునేమో.

కణ్వమహర్షికి వనలతావృక్షములపైగల ప్రేమాతిశయములను కాళిదాసు మనోహరముగ రూపించినాడు.

శకుంతలయు, చెలికత్తెలగు ప్రియంవద, అనసూయలును పూలచెట్లకు నీరుపోయుచు ఇట్లు ప్రసంగముచేసిరి:—

"అనసూయ:-శకుంతలా! కాశ్యపతాతకు, నీకన్నా ఈ ఆశ్రమవృక్షాలు ప్రియతరములా?- అని యోచిస్తున్నా. ఏమంటే, నవమల్లికాపుష్పముకన్నా కోమలమైన నిన్నుకూడ, ఈ చిన్నిచెట్లకు నీరుపోయమని నియమించాడే?

శకుంతల:-కేవలం తాత చెప్పేడనేకాదు; వీనియందు నాకు సోదరీస్నేహం కలదుకూడా."

ఎంత సోదరీస్నేహం లేకపోతే—అత్తవారింటికిపోతూ శకుంతల—వనజ్యోత్స్న అనే లతను తన్ను కౌగలించుకొని వెళ్లను అనుజ్ఞయిమ్మని కోరుతుంది? ఆమె ప్రయాణ సమయాన కణ్వుడు వనదేవతలను ఆమెకు అత్తింటికివెళ్ళను ఆజ్ఞయిమ్మని కోరుతాడు. వనదేవతలున్ను అంగరాగములు, ఆభరణములు ఇచ్చి ఆమెను సాగనంపుతారు!

సౌకుమార్యము స్త్రీలకుఉత్తమలక్షణము. ఆ సౌకుమార్యములో శ్రేష్ఠమైనదానిని-శాస్త్రకారుడు నిర్వచించుచు, "ఏస్త్రీమైతే పువ్వు తనవంటికితాకినా ఓర్చుకోలేదో, ఆమెది ఉత్తమసౌకుమార్యం" అన్నాడు. అందుచేతనే కాబోలు—స్త్రీలు పుష్పాలను హెచ్చుగా మన్నిస్తారు; రసహృదయులైన పురుషులున్నూ, ఆ స్త్రీలనూ, పువ్వులనూ, పూదోటలనూ సేవిస్తారు.

※

## నా తోట

నాకు చిన్ననాటినుండియు తోటపనియనిన అమిత ఆశ. నేను మాగ్రామములో యున్నప్పుడుకూడ నాపూరింటిచుట్టును కాకర, పొట్ల, చిక్కుడు చెట్లపాదులను, మల్లెచెట్లను, సన్నజాజిచెట్లను, తీగెసంపెంగను, జామచెట్టును, జడపత్తిచెట్లనువేసి పెంచుచుంటిని. కొత్తిమిరపాదును వంగమొక్కలను మెరపనారునువేసి యేటినుండి కావడితోనీరుతెచ్చి వాటికి పోసి పెంచుచుంటిని. పెరుగుతోటకాడలను పెంచుచుంటిని. ఈ చెట్లకు పెంటదిబ్బమన్నును

వేసి బలపరచుచుంటిని. ఈ విద్యనాకు చిన్నప్పటినుండియు అలవడినదే. ఇది మా వూరిలో నేర్చుకున్నవిద్య. నేను ప్రయోజకుడనైన పిమ్మట బెంగుళూరునందు ఒక యింటిని కొంటిని. ఆ యిల్లు విశాలమైన ఖాళీస్థలమునందుండెను. ఇల్లును కొన్నప్పుడు యింటిచుట్టు దట్టముగ మామిడిచెట్లు, కొద్దిగ చింకాయచెట్లు మొదలగునవి మాత్రమేయుండెను. నివసించు యింటిచుట్టు మామిడిచెట్లుండుటచే దోమలబాధను సహింపజాలకుంటిమి. మామిడిపండ్లకాలములో సన్నదోమలు పగలుకూడ కండ్లలోకిపోయి బాధించుచుండెను. ఇందువలన కండ్లకలకవ్యాధికూడ వచ్చుచుండెను. ఈ కారణమువలన యింటిసమీపమున యుండు కొన్నిమామిడిచెట్లను మాత్రము కొట్టివేయవలసివచ్చెను. ఫలించు ఫలవృక్షము లను నరికివేయుటకు మనసొప్పకపోయినను చేయకతప్పదాయెను. ఇంటివద్దయుండు మామిడిచెట్లను కొట్టివేయగనే నివసించుయింటిలోకి మంచివెలుతురు, గాలి, యెండప్రవేశించ దొడగెను. అప్పుడు బాధించుచుండిన దోమలు మాయమాయెను.

బెంగుళూరుపట్టణము మంచి పూదోటలనువేసి పెంచుటకు అనుకూలమైన వాతా వరణముగలదగుటచే అనేకులు వార్లయిండ్లచుట్టు పుష్పవనమును ఫలవృక్షములను వేసికొని ఆనందించుట నేను చూచితిని. ఆ తోటలను చూచినప్పటినుండియు నాకును అటువంటితోటలను పెంచవలయుననే కోరికకలిగెను. ఈ కోరిక కలుగగనే బెంగుళూరు లాల్‌బాగ్ తోటసంఘములో సభ్యుడనైతిని. తోటసభ్యులందరియిండ్లకు గార్డన్ సూపరిండెంటువచ్చితోటను యేవిధముగ వేయవలసినది మార్గములన్నిటిని బోధించుచుండెను. నేనావిషయములన్నిటిని శ్రద్ధగ నేర్చుకొని నా తోటను వేయుటకు ప్రారంభించితిని.

నాయింటి ముఖద్వారము తూర్పుదిశను చూచుచుండును. చలిదేశమగు బెంగు ళూరునందు ప్రాతఃకాలమున సూర్యభగవానుడు మా యింటప్రవేశించి మమ్మానందింప చేయుచుండెను. ఇంటివాకిటికెదురుగ విశాలమైన నలచదరపుఖాళీస్థళముండెను. ఆ స్థళపు మూడుదిశల ప్రహరిగోడలప్రక్కన గోడ కనుపడకుండునట్లు మూడువరుసల పూలచెట్లను వేయించి పెంచితిని. మొదటివరుస వంటిరెక్క (Single) దాసాని పూలచెట్లను, రెండవవరుస ముద్ద (Double) పువ్వులదాసాని పూలచెట్లను, మూడవవరుస కాశీతుంబ (Balsam) చెట్లను వేసితిని. ఈ మూడువరుసల పూలచెట్లు పూచినప్పుడు చూచిన పూలమెట్లవలె కాన్పించును. మొదటివరుసచెట్లు పొడవుగ పెరుగును. రెండవవరుసచెట్లు పొట్టిగ గుబురుగ పెరుగును. మూడవవరుస బాల్సంపూలచెట్లు ఒక అడుగుపొడవున మాత్రమేపెరిగి దట్టముగ పూలు పూయును. ఈ దృశ్యము కనులపండువుగనుండును.

ఈ కడపటి పూలచెట్ల వరుసనుండి 10 అడుగుల మోటారురోడ్డును వేయించితిని,

ఈ రోడ్డు ప్రక్కననే పొట్టిబంతిచెట్లను (French marigold) నాటించితిని. రెండవవరుస ఫ్లాక్సను విదేశపూలచెట్లవరుసను వేయించితిని. ఈ రెండువరుసల పూలమధ్యను విశాలమైన లాన్ (Lawn) యని పిల్వబడు గడ్డినేలను తయారుచేయించితిని. ఇది చూచునప్పుడు ఏలూరు రత్నకంబళివలె కాన్పించును. ఈ రత్నకంబళి నాల్గుమూలలను సైప్రస్ చెట్లను పెంచితిని. ఈ చెట్లు శాఖలులేక పచ్చగ గుబురుగ 50 అడుగులవరకు పెరిగినవి. ఈ చెట్లను తలయెత్తిచూచినపుడు తమాషగ నుండును.

ఈ సైప్రస్ చెట్లప్రక్కననే నాలుగుమూలలను సిమెంటుతో తయారుచేయబడిన అందమైన పెద్దపూతొట్లనుకట్టించి అందులో వెర్బీనా (Verbeena) యను తీగపూలచెట్లను నాటితిని. ఈ చెట్టుపూచినప్పుడు తొట్టికనుపడకుండ చిక్కగపూయును. తీగనిండుగ పూలుపూచి వ్రేలాడునపుడు చూచిన చాల అందముగ కనుబడును. ఎఱ్ఱబిగోనియా (Bigonia) చెట్లతీగెలను సైప్రస్ చెట్ల నాలుగింటికిని తోరణముగ అల్లించితిని. అవిపూచినపుడు నాలుగుప్రక్కలను రక్తవర్ణపు పూలతోరణముగ కనుబడును. ఈ గడ్డినేల (Lawn) మధ్య సిమెంటుతో గుండ్రముగ నీళ్లతొట్టినికట్టించి దానిమధ్య పూలకొళాయిని నిర్మించితిని. ఈ కొళాయితిరుగునపుడు పూలవర్షము కురిసినట్లు, చక్రాకారముగను, పద్మాకారముగను నీళ్లను చిమ్ముచుండును. నీళ్లతొట్టిలో తామరపూలతీగెలనుపెంచి పూలుపూయించితిని. ఈపూలమధ్య బంగారురంగు, వెండిరంగు, ఎఱ్ఱరంగుగల చేపలను తెచ్చి విడిచితిని. ఈ రంగుచేపలు నీళ్లలోయీదునపుడు తళతళయని మెరయుచుండును. ఇంటిముఖద్వారపు మెట్లమీద డాలియా (Dhalia) యను పూలచెట్లను పెద్దతొట్లలోవేసి ప్రదర్శనమునకు పెంచితిని. ఈ చెట్లనుపెంచుట అంతసులభమైన కార్యముకాదు. మంచియెరువు, శుశ్రూష కావలయును. ఈ చెట్టు సుమారు 4, 5 అడుగుల యెత్తువరకు పెరుగును. పువ్వువెడల్పు 5, 6 అంగుళములవరకుయుండును. అనేకరంగులతోపూయును. పూచినపువ్వు బంతిపూవు వలెయుండును. ఇది నిర్గంధకుసుమము. ఇంకను వాకిటిముందర జినియా, కాస్మాస్, కలియోప్సిస్, పిటోనియా, ఫ్లాక్సుఅను పలువిధములయిన పరదేశపుపూలజాతుల నుంచితిని. బంగళాచుట్టుయుండు కిటికీలవద్ద రాత్రిరాణి (Night-Queen) మల్లె, మొల్ల, జాజి మొదలగు సుగంధపుష్పజాతులను వేసిపెంచితిని. రాత్రిళ్లు యీ పూలువికసించి యిల్లంతయు అత్తరుబుడ్లు విరిగిపోయినట్లుగ వాసనవిసరును. ఇంటియిరుప్రక్కలను మాలతి, మాధవి లతాగృహములను నిర్మించితిని.

ఇంటివెనుకభాగమున ఆస్ట్రేలియాజాతి ఆపిల్ పండ్లచెట్లను, అంజూరు (Figs) పండ్ల చెట్లను, అలహాబాదు జామపండ్లచెట్లను, మేలయిన బొప్పాయి మొదలగు ఫలవృక్షములను




పు ష్ప వ న ము

"మానవుడు అన్నిటికంటెను పుష్పవనమున ఈశ్వరసాన్నిధ్యమునకు చాలదగ్గర నుండగలడు"——కేసరిగారు

వేసితిని. అవి కాచి ఫలములు పక్వమునకురాగానే రాత్రిళ్లుతోటలో చిలుకలు పక్షులు ప్రవేశించి భక్షించుచుండును. మదురుగోడలనుదూకి దొంగలుకూడ రాత్రిళ్లు అపహరించు కొని పోవుచుందురు. కాయకూరలను వెనుకభాగముననే వేయుచుంటిని. ఇక్కడపెంచిన వంకాయలు టెంకాయలంతేసియుండును. ఈ నల్లవంకాయలు బజ్జికి బాగుండును. పాల బెండకాయలు సుమారు 1 అడుగువరకు పెరుగును. కొతిమెరాకు, తోటకూర వగైరాలు అతికోమలముగ మెత్తుగపెరుగును. ఈ వూరి కూరగాయలు కంటికిబాగుండునేగాని రుచి తక్కువ. కాయకూరలరుచికి వంగవోలు ప్రాంతములలో మెట్టన పండునవియే శ్రేష్ఠము. బెంగుళూరులో విక్రయించు వంకాయలు చేదుగనుండును. పెద్దకాకరకాయలు తియ్యగ నుండును. ఇందుకు కారణము కృత్రిమయెరువులతో కాయకూరలను పెంచుటయే.

ఇంటి వెనుకభాగముననే ఔషధములను తయారుచేయు కర్మాగారమును (Factory) అతిథులగృహమును, ఆఫీసును వేరువేరుగ కట్టించితిని. ఈ మందిరములకు యెదుట పందిళ్లువేయించి నల్లతెల్లద్రాక్షతీగెలను అల్లించితిని. ఈ ద్రాక్షపండ్లు బాగుగకాయు చున్నందున మేము తనివితీరతిని యితరులకుకూడ పంచిపెట్టుచుంటిమి.

ఈ తోటలో యొకభాగమున అశ్వత్థవృక్షము వేపచెట్టు కలసియుండెను. ఆ చెట్ల క్రింద నాగప్రతిష్టకలదు. ఆ చెట్టుచుట్టు నల్లరాళ్లతో అరుగును కట్టించితిని. ఆదివారము నాడు ఆ దేవుని పూజించుచుంటిమి. అప్పుడప్పుడు అక్కడకూర్చుని విశ్రాంతి తీసుకొను చుంటిమి. మరియొకభాగమున చంపకపుష్పముల వృక్షముండెను. ఈ మాను సంపెంగ చెట్టుక్రింద సిమింటుతో రెండుఅరుగులనుకట్టించితిని. ఉదయమున కొంతకాలము తోటలో దిరిగి ఆ యరుగులమీాద కూర్చుండి అలసటతీర్చుకొను అలవాటు. ఈ సంపెంగచెట్టు క్రిందనే వచ్చినవారితో ముచ్చటలాడుచుండువాడను. ఈ చెట్టుపూచినప్పుడు ఈ చెట్టు నీడను విడిచిపోవుటకు మనసొప్పకుండెడిది. ఈ నీడను నే నెట్లుమరవగలను?

తోటలో మంచి మామిడిచెట్లుండెను. పీతర్ (రసపురి) గోవా (బాదామి) మల్గోవా, ఆవకాయ పెట్టుకొనుటకు పుల్లటికాయలు మొదలగు మామిడిజాతులుండెను. పనసపండ్ల చెట్టుండెను. ఆ పనసతొళలను విరిచిన కొబ్బరివలె విరుగును. చక్కెరతో సమానమైన రుచిగలది. ఈ పనసపండుతో పాయసమును, హల్వాను తయారుచేసుకొను చుంటిని. కాయలేతతొళలతో వరుగులువేయించుకొని నిల్వచేసుకొనుచుంటిమి. నేలకు తగులు టెంకాయగొలలచెట్టు, దాహమునుదీర్చు యెళనీరుటెంకాయచెట్లు, కొళంబొజాతి పెద్దటెంకాయచెట్లు మొదలగునవి తోటలోయుండెను. ప్రత్యేకముగ చెప్పదగిన వెలగ పండ్ల చెట్టుండెను. తెల్లవారగనే ఆ చెట్టుక్రిందికి పోయినప్పుడెల్లను వెలగపండు లభించు

చుండెను. కపిత్థం సర్వదా పథ్యమనుటవలన ఆ పండునంతయు నేనెతినుచుంటిని. మామిడి చెట్లకు పచ్చిమిరియములతీగెలను అల్లించితిని. ఆ పచ్చిమిరియములనుకోసి నిమ్మపండు, వుప్పుతోకలిపి వూరనిచ్చిన అరోచకమునకు మంచిమందు.

రోజాపూలచెట్లనుపెంచుటకు బెంగుళూరు మంచిస్థళము. అనేకరకముల రోజా పూలచెట్లను తెచ్చినాటితిని. ఈవూరి తీగెరోజాచెట్టు ప్రశస్థమైనది. దీనిని పందిలిమీద అల్లుబెట్టిన అందముగనుండును. ప్రతిదినము గంపెడుపూలను కోయుచుంటిమి. మా బంగళాపేరు లోధ్రలాడ్జి (Lodhra Lodge) యని పెడితిని. బంగళా వీధిగేటువద్దనుండి మోటారుషెడ్డుకు సుమారు 400 అడుగుల పొడవుగల రోడ్డుగలదు. ఈ రోడ్డంతయు నల్లరాళ్లతో పరుపబడినది. ఈ పొడుగునను తీగెలపందిటిని (లతాగృహము) నిర్మించితిని. ఈరోడ్డంతయు సూర్యరశ్మిలేక చల్లగనుండును. పొడుగాటి మామిడిచెట్లకు ఊగు వుయ్యాలలను అక్కడక్కడ కట్టించితిని. ఈ పుష్పవనమంతటికిని నీరుపారుదలకు భావిని త్రవ్వించి దానికి యెలక్ట్రిక్ పంపును అమర్చితిని. ఈ నూతినీరు అమృతమువలెనుండును.

ఇంటిలో కృష్ణమందిరమును కట్టించితిని. ఈ దేవునిపూజించుటకు కృష్ణతులసి రామతులసి మొదలగు కదంబపూజా ద్రవ్యములను వేసిపెంచితిని. ఇంటిముంగిట బృందావనమును కట్టించితిని. ఇల్లంతయు చిత్రకూటముగమార్చితిని. తోటంతయు విద్యుచ్ఛక్తి దీపస్తంభములనునాటించి వాటికి రంగులడోములను అమర్చితిని. రాత్రివేళలలో యీ దీపములను వెలిగించిన బృందావనముగనేయుండును. ఇంటిలోపల అన్నివసతులతోకూడ విద్యుచ్ఛక్తితో వంటచేసుకొనుటకు వేడినీరుకాగుటకు యేర్పాటుల నమర్చితిని.

క్రోటన్సు (Crotons) యను రంగుచెట్లను సుమారు వెయ్యితొట్లవరకు బారులు దీర్చియుంచితిని. రకరకముల రంగుచిలుకలను పంజరములలోనుంచి చెట్లకు వ్రేలాడగడితిని. దీనిని పాటపాడుతోట (Singing gardens) యని చెప్పుదురు. మరియు ననేకవినోదములతో తోటను దిద్ది తీర్చితిని. ఇది నా బెంగుళూరు పుష్పవనశృంగారము.

బెంగుళూరునందు సర్కారువారు ప్రతిసంవత్సరమును లాల్‌బాగునందు పుష్పప్రదర్శనమును (Flower Show) యేర్పాటుచేయుచుందురు. ఈ సందర్భముననే పూరిలో తోటపోటీకి (Garden competition) కూడ యేర్పాటు జరుగుచుండును. ఈ తోటపోటీకి బెంగుళూరుసిటిలోయుండువారును కంటోన్‌మెంటు (దండు)లోయుండు తెల్లదొరలును పాల్గొనుచుందురు. ఈ తోటలు ఒకదానికిమించి యొకటి కనుబడును. అందరుకూడ పోటీలో గెల్వొంది బహుమతులనుపొందు అపేక్షతో తోటలను కష్టపడిపెంచినవారే. పోటీతోటలను పరీక్షించి మార్కులనుయిచ్చుటకు అనుభవస్థులగు తెల్లదొరలు, హిందువులుకలసివచ్చి తోటలను పరీక్షించిపోవుచుండెడువారు. ఈ పరీక్షలో నా తోటవరుసగ

యెనిమిది సంవత్సరములుగెల్పొంది వెండిగిన్నెలను బహుమతులనుపొందినది. ఈ బహుమతులను లాల్‌బాగ్‌తోటలో మైసూరుదివాన్‌గారు పంచిపెట్టుచుండిరి. ఈ యనుభవము వలన నన్నుకూడ తోటలను పరీక్షించుటకు జడ్జిగ యెన్నుకొనిరి.

ఈ నా ఆనందాయినియైన నందనవనమును ధనాశాపిశాచమావేశించి హెచ్చు ధరకు నేతి వ్యాపారస్థులగు నొక కోమటిశెట్టిగారి కమ్మితిని.

ఆ తోటవిక్రయమువల్ల వచ్చినధనమును బ్యాంకులోనుంచితిని. కాని నేను ప్రతి నిత్యము ఆ పూవుతోటలో అనుభవించుచుండిన ఆనందమునకు మాత్రము దూరమైతిని. దానిని అమ్మగావచ్చినధనమునైన నా కంటచూచుటలేదు. ప్రతినిమిషము నాకెంతో ఆనందము చేకూర్చుచుండిన పుష్పరాజములగు నా బంధుమిత్రులున్నూ నా కంటికి శాశ్వతముగ కానరాకుండపోయిరి. ఈ కారణమున నేను నిరంతరచింతచే కొంతకాలము మందబుద్ధినై గడిపితిని. అదృశ్యమైన నా ఆనందమునుగూర్చియే నేను మననచేయుచుండగా—నా కొకమంచి యోచనతట్టినది. ఆనందము అనగా బ్రహ్మగదా. ఆ బ్రహ్మకు సరస్వతి గృహలక్ష్మి. సరస్వతి చదువులకు రాణి. ఆ చదువులరాణిపేరట నాతోట విక్రయధనము ముడుపుకట్టియుంచితిని. దానితో శేఎరీవిద్యాలయమును స్థాపించి తిరిగీ నా యానందమును పొందదలంచితిని.

ఈ విద్యావనస్థాపనచే నా మనస్సునకు శాంతికలిగినది. ఈ విద్యాలయపు వేపచెట్లనీడను కూర్చుండి అక్కడక్కడ కళకళలాడు పువ్వులను చూచుచున్నప్పుడు నాకు పూర్వపు బెంగుళూరి పుష్పవనస్థ చంపక వృక్షచ్ఛాయలు స్మృతికివచ్చును. గుంపులుగట్టి వందలకొలదిగ బాలబాలికలు విద్యాసక్తులై, నవ్వుచు, ప్రేలుచు, వికసించిన పువ్వులవంటి ముఖబింబములతో నాకు కన్పించగనే, వివిధపుష్పశోభితమై, శుకశారికాకలకలముతో కూడినదై, నన్నానందమున ముంచి తేల్చుచుండిన నా బెంగుళూరి పుష్పవనమున నున్నట్లే అనిపించి—మరల ఆనందించుచుందును.

ఆ పూవుతోటను ఏ శ్రద్ధాభక్తులతో పెంచి పెద్దచేసితినో, అట్టి శ్రద్ధాభక్తులతోనే, ఈ విద్యావనమునుపెంచి పెద్దదిగానొనర్చుటకు ఈశ్వరుడు నన్ను అనుగ్రహించి అనుకూలించుగాక. ఈ విద్యావనము బెంగుళూరివనముకన్న శాశ్వతమైనదికదా! ఇందు విద్యాగంధముతో వికసించు కిశోరహృదయములు, వాడనిపూలు; వాసనతరుగనిపూలు; లోకకల్యాణప్రదములు!






కేసరి హైస్కూలు, మైలాపూరు.



చెన్నపట్నంలో తెలుగు బాలబాలికలకు తెలుగులో చదువుకొనే సౌకర్యప్రాప్తమవుతున్నదనే ఈ రోజులలో సుమారు 500 మంది తెలుగుబిడ్డలు,—అక్షరాల తరగతినుండి ఆరోఫారమువరకు — ఈ పాఠశాలలో తెలుగులో చదువుకొంటున్నారు. ఇక నంతమంది స్థలంలేక విచారంతో నిరాకరింపబడుతున్నారు. తగిన భవనముండి, వసతిగృహముండి, క్రీడాస్థలముంటే వచ్చేవారినందరినీ చేర్చుకోవచ్చు. అన్నిటికీ ధనంకావలెను.

# ఇంటిపనులలో మెళకువలు



## జలుబు—పిల్లలను కాపాడుట

ప్రస్తుతపు రోజులలో పసిపిల్లలకు తమతల్లుల పొత్తిళ్లలోనుండగనే సంభవించువ్యాధులలో జలుబు ముఖ్యమైనది. దీనిని తగుసమయమున నిర్మూలించుటకై చర్యతీసుకొనకపోవుటచే అనగా తగుచికిత్సచేయక పోవుటచే నిమోనియా, బ్రాంకాయిటిజ్ అను భయంకర వ్యాధులరూపమున పొడముచున్నవి. పిల్లలకు ఈజబ్బుకలుగగనే జలుబుచే యీ వ్యాధికి లాగినదనితలంచి జలుబునుండి రక్షించుటకొరకై పిల్లలకు వేడిని గలుగజేయు గుడ్డలను కప్పియు, ధరింపచేసియు కాపాడుచున్నారు. కాని ఆ రోగము సమూలముగ నశింపబడదు. ఆరోగ ముఖ్యకారణమేది? ఈ జబ్బుప్రారంభములో పిల్లలముక్కులనుండి నీరుకారుటయు తరువాత నాసికారంధ్రములు బిగించినట్లు ఊపిరిసల్పుటకు కష్టముగనుండును. ఊపిరిసలుపకపోవుటచే పొట్టలో ఏదోకొంచెము నొప్పిగాయున్నట్లుండి దగ్గుమొదలిడును. అటువంటిపరిస్థితిలో పిల్లలకు కంఠస్వరములో ఊపిరిసలుపకపోవుటయుగూడా సంభవించును. అప్పుడు తల్లులు తమకు యిష్టమువచ్చిన మందులనుచేసి బిడ్డలకువేసి వారిజలుబుపరిస్థితిని వృద్ధిజేసి తమబిడ్డలప్రాణములను నిరాశజేసుకొందురు. ఈ రోగమునకు అనేకకారణములుగలవు. పిల్లలకు ఎక్కువగా పాలుత్రాగించుట, నిద్రించుచుండు పిల్లలనులేపి పాలుత్రాగించుట, బిగుతుగానుండు దుస్తులను ధరింపచేయుట, వాయువునుండియు, సూర్యరశ్మినుండియు వేరుగనుంచుటయు, ప్రేమకారణముచే ఏడ్చినప్పుడల్లా పాలుత్రాగించుటయును మొదలగునవి కారణములు. కాని తల్లి తనఆహారవిహారములయందు సరిగానుండక పోవుటయే ప్రధానకారణము. తల్లి రీతి రివాజుల ననుసరించియే పసిబిడ్డలకు ఆహారమగు రక్తము, పాలును ఏర్పడుచున్నవి. మనము వ్యాధిగ్రస్త పశువులపాలు త్రాగినచో ఎట్లుజబ్బులపాలగుదుమో, అటులే తల్లిపాలననుసరించి బిడ్డలుకూడ వ్యాధులపాలగుచున్నారు. తల్లి పిల్లలమీదప్రేమచే వారిని గాఢనిద్రనుండి మేలుకొలిపి పాలుత్రాగించియు, జలుబు, పడిశములనుండి తప్పించుటకై బిడ్డలను గుడ్డలపొత్తలతో కాళ్లచేతులాడకుండునట్లును, తొడలకు అంటుకొనునట్లుగా అదిమి గాలితగులకుండునట్లు చేయుటచే పిల్లలు వ్యాధిగ్రస్తులగుచున్నారు. మరియు సరియైనగాలియు, ఎండయు తగులకపోవుటచే సూర్యరశ్మిలేకపోవుటచే పద్మములు ఎట్లులాడుచున్నవో అటులే పిల్లలుకూడా వాడిపోవుచున్నారు. ఈ రోగమునుండియు, తదితరరోగములనుండియు పిల్లలను రక్షింపవలెనన్న తల్లి తనఆహారవిహారములయందు బహుమెలకువగానుండవలయును. ఈ విధముగా తల్లి ఆహారవిహారములయందు తన జీవితమంతయు సరీగానుండవలయును. కాని ముఖ్యముగా తల్లి తన గర్భావస్థకాలమునుండి శిశువు పాలు త్రాగుట మానివేయుకాలమువరకునైనను ఆహారపానీయములయందు శ్రద్ధగలిగియుండవలెను. పిల్లలకు మలబంధములేకుండాచేయవలయును. శిశువులకు ఈ రోగముకలిగినప్పుడు డాక్టర్లు, వైద్యులు అనేక శీతోష్ణములను గలిగించు వస్తువులు, సూది (యింజక్షనిచ్చి) మిక్చర్లు, రసాయనములు మొదలగు మందులనిచ్చి ఆ రోగము పారద్రోలుటకును, సమూలముగా నాశనముచేయుటకు ప్రయత్నముచేయుదురుకాని ఆ మందుల వలన ఆ జబ్బుకొంచెము తగ్గినట్లుగా కాన్పించునుకాని తరువాత ఆ మందుల విషప్రభావమువల్ల శిశువులకు, టాన్‌సిల్స్, నిమోనియా, ఉబ్బసము మొదలగు భయంకరరోగము లుద్భవించును. దానివలన ప్రారంభములోకన్న ఎన్నోరెట్లు వ్యాకులతసంభవించును. గ్రామములలో తల్లులు తమబిడ్డలకు ఈ వ్యాధిసంభవించిన డాక్టరులిచ్చు మందులనువాడక గ్రామములోదొరకు మందులను, నీరుల్లిపాయరసమును, తల్లిపాలను త్రాగించుటయును, శిరముమీద తల్లిపాలను మర్దించియు, పొట్టమీదవ్రేళ్లతో కాటుకను అంటించుటయు మొదలగునవి చేసి సంతోషపడుదురు. అధికముగా నయమగుచుండును.

కాని ఆ చికిత్సకు బదులుగా ప్రకృతిచికిత్స చికిత్సానుసారముగాచేసినచో వెరపులేకుండ శిశువులు సుఖముగానుందురు. ఆ సమయమున అనగా పిల్లలకు ప్రకృతిచికిత్సజరుపు సమయమున తల్లి ఫలములమీదను, కూరలమీదను, పాలమీదను ఆధారపడియుండవలెను. మరియు ఎనీమాచేసుకొని ఉదరమును స్వచ్ఛముగా నుంచుకొనవలెను. బిడ్డలకుకూడా ఆ చికిత్సాకాలమున, కమలాఫలరసమునుగాని, రామములగకాయరసమును గాని, లేక, నారింజరసమునుగాని లేక మంచిరసముగల యితరపండ్లనుకాని వాడుచుండవలయును. శిశువుల ఉదరము పరిశుభ్రముగానుండవలయునన్న తల్లి యిచ్చుపాలతోపాటు రోజుకు రెండుమూడుసార్లు నారింజ రసమునుగాని, రామములగకాయరసమునుగాని, లేక తల్లిపాలతో రెండుమూడు తేనెబిందువులనుకలిపిగాని యివ్వవలెను. ఎనీమాచేసినను చేయవచ్చును. వేడినీటియందు శుభ్రముగా స్నానముచేయించి గుడ్డనుకప్పి నిద్ర పుచ్చవలయును. ఈవిధముగా ఉదయము సాయంసమయములయందు రోజుకు రెండుసార్లు చేయవలయును. అట్లుచేయుటవలన చర్మరంధ్రము తెరుచుకొని శరీరములోనున్న మురికి స్వేదరూపమున బయలువెడలును. బిడ్డపడుకొనియున్నగది గవాక్షములను తెరిచియుంచినయెడల గాలి, వెలుతురు తేలికగాగదిలో ప్రవేశించి బిడ్డకు ఆరోగ్యముకలిగించును. యిట్లుచేయుటచే తాత్కాలికముగా ఆవ్యాధి వుపశమింపవచ్చును.

కాని ఎల్లప్పుడును జలుబువ్యాధులు బిడ్డలకు రాకుండచేయవలయునన్న తల్లి తనగర్భావస్థకాలమున ఆహారనియమములను ఈ విధముగా కాపాడుకొనవలయును. స్త్రీజనము గర్భావస్థసమయములో తమ బిడ్డలకొరకును, తమకొరకును, ఆహారమును యితోధికముగాతిను భ్రమను కలిగియుందురుగాని యిది సరియైనదికాదు. కాని ఫలములు, కూరలు పూర్వముకన్న ఎక్కువగా వాడవలయును. రోజుకు మూడుసార్లు భుజింపవచ్చును. దాహముగా నున్నయెడల ఫలరసములలో కొంతనీటినికలిపి ఎన్నిసార్లు దాహమైన అన్ని సార్లు త్రాగవచ్చును. అట్లుత్రాగుటవలన ఆమాశయమునందుమిగిలిన ఆమ్లపదార్థము పేగులయందు పంపబడి ఆకలివృద్ధియగును. ఉదయము తాజాఫలములను, ఎండిన ఫలములను యిష్టమయిన పాలు, లేక, మజ్జిగయైనను త్రాగవచ్చును. ఫలములలో రసముగల కమలాఫలములు, రామములగపండ్లు, సీమరేగుపండ్లు (Apples), కిస్‌మిస్, అత్తిమొదలగు పండ్లను యింకను ఆయా ఋతువులయందు దొరకుయితర పండ్లనువాడుటవలన గర్భిణీ స్త్రీలకు తగుబలము చేకూర్చును.

మధ్యాహ్న సమయములయందు గర్భవతులు పచ్చికూరలను, (అనగా మసాలా చేయబడిన కూరలు) రుచిగా నుండుకొరకు ఒక ఆకుకూర, ఒకవిధమగు క్యాబేజీకూర, ధనియాలు, మొదలగువానిచే వేయించ బడిన కూరలుతినవలయును. రసభరితములైనపండ్లు, కూరలు, రామములగఫలములు, నారింజ, మొదలగుగట్టి పండ్లను, లేక, కూరకుపనికివచ్చు ఒకవిధమగు దోసకాయ, సొరకాయ, ముల్లంగి, జామ, రేగు, మొదలగువాటియందు ఒకచెంచా తేనెగాని, ఒకచెంచా మజ్జిగగాని, లేక కొన్నికిస్‌మిస్ గింజలుగాని, లేక నిమ్మరసముతోగాని పుచ్చుకొనవలయును. ఉడికించినకూరలు, పంచదారతో వండినరొట్టెలు, మజ్జిగపుచ్చు కొనవలయును. పిండి లేకపోయినచో బియ్యపునూకను ఉపయోగింపవలయును. పండిన అరటిపండ్లను, (పచ్చివైనను) ఉడికించి తినవచ్చును. రాత్రిసమయమునందు కూరలు, గంద్రనూకతో తయారుచేయబడిన పిండిరొట్టెయు, ఎండుద్రాక్షయు, పక్వములగు అరటిపండ్లు, బంగాళాదుంపకూర, ఒకచటాకీ, అత్తిరస మును తీసుకొనవచ్చును. భోజనవిధానము లన్నింట కలయును—బియ్యము, బియ్యముపిండి, గోధుమ, జొన్న, సజ్జలు, మొదలగువాటితో తయారుచేయబడిన వస్తువులను తీసుకొనవచ్చును. పాలు, పాలతోచేయబడిన వస్తువులు, వెన్న, మజ్జిగ, పెరుగు, నేయి మొదలగునవికూడా వుపయోగింపవచ్చును. ప్రసవించిన తల్లి యొక్క భోజనవిధానము మిట్లుండవలయును. —16% కణములు (అన్నము) 28% పాలు, పాలుతో తయారుచేయబడినవి, 56% ఫలములు, కూరలుయుండవలెను. చర్మము స్వచ్ఛముగాను, కాంతిగానుండుకొరకు మంచి స్వచ్ఛమైన గాలిగల ప్రదేశములోను, వెలుతురుగల ప్రదేశములోను, తిరుగుచుండవలెను. స్వచ్ఛమైన

గాలిని పీల్చుచుండవలయును. తల్లి నిత్యము 9-10 గంటలు నిద్రింపవలయును. మధ్యాహ్నము భోజనము తిరువాత అరగంటైనను విశ్రాంతి తీసుకొనవలయును. వస్త్రధారణవిషయములో యీనియమములను పాటింపవలయును. (1) చర్మమునకు గాలితగులువిధముగా నుండవలయును. (2) శరీరములో ఉష్ణత హెచ్చింపకుండునట్టును, తగ్గింపకుండునట్లుగాను ధరించవలయును. (3) శరీరమునకు ఏభాగమున విశేషించి ఉదరము, గర్భాశయము, మూత్రాశయములకు, ఒత్తిడికలుగకుండునట్లు ధరింపవలయును. (4) ఆరోగ్యం బాగుగానుండుట కొరకై సుందరములైన వస్త్రములను ధరింపవలయును. యిప్పటిస్త్రీలు బిగువురవికలు ధరించుచున్నారు. దీనివలన రక్తసంచారము మందగించి పిల్లలకు పాలుత్రాగుటయందు అయిష్టత సంభవించును.

పరిశ్రమ—వ్యాయామవిషయంలో (గర్భకాలమందు) యింటిలో యితరపనులన్నియు చేయుచు మధ్య మధ్య గంట లేక అరగంట చక్కనిగాలిలో తిరుగుచుండవలెను. తిరుగలి విసరవచ్చును. ఆఖరుమాసమున అనగా తొమ్మిదవ మాసమునమాత్రము భారముగల పనులన్నియు మానివేయవలయును.

మరుగుదొడ్డు—: వీటికి రెండుసారులువెళ్లుటఆవశ్యకము. మలబంధకము కలిగినయడల ఎనీమాచేసుకొని ఉదరమును పరిశుభ్రముగానుంచుకొనవలయును. లేనియడల కడుపులోనుండు విషము రక్తమునగలిసి శిశుజనన సమయమున బాధకలిగించును.

(సంసార్ నుండి)

---




(గతసంచిక తరువాయి)

15. వేపచెట్టు గుణములనుగురించి హిందూవైద్యుల కందరికిని చక్కగ తెలియును. వేపచెట్టుపట్ట, వేళ్లపట్టకషాయము జ్వరానంతరమునకలుగు బలహీనతకు, ఆకలిని కలిగించుటకు మంచిమందు. వేపపువ్వు అజీర్ణమునకును, అన్నహితవును కలిగించుటకును మంచిది. వేపకొమ్మతాటితో తయారుచేసిన టించరు **(Tincture)** మలేరియాజ్వరములకు వాడగ గుణమిచ్చినది. వేపచెట్టువేరుతో తయారు చేయబడిన కషాయముకూడ చలిజ్వరములకు చక్కగ పనిచేసినదని డాక్టరు కోమర్ గారు వారి రిపోర్టులో వ్రాసినారు.

16. నల్లజీలకఱ్ఱ ప్రసవానంతరము కలుగు జబ్బులకు మంచిమందు. నల్లజీలకఱ్ఱ కషాయమువలన ప్రసవానంతరమున గర్భాశయము స్వస్థానమునకు చేరుటయే గాక తల్లికి సమృద్ధిగ పాలుపడునని డాక్టరు పరీక్షించి చెప్పిరి. నల్లజీలకఱ్ఱను పొడిచేసి బెల్లములోకలిపి యిచ్చిన పైగుణములు యిచ్చును.

17. సదాపచెట్టు - ఇది చిన్నచెట్టు. ఘాటుగల వాసనగలది. బిడ్డలకువచ్చు వాతవ్యాధులకు, మూర్ఛ, కఫవ్యాధులకు ఆకురసమును వాడిన వ్యాధులు కుదిరినట్లు డాక్టరుగారు చెప్పిరి.

---




## —:వెలగపండు పచ్చడి:—

"కపిత్థం సర్వదా పథ్యం" అని వాడుక గనుక వెలగపండు ఆరోగ్యమైన ఫలము. వెలగపండులో యుండు గింజలలో ఒకగింజమాత్రం అమృతతుల్యమైనదని చెప్పెదరు. ఆఫలము అనుభవించవలయుననిన వెలగపండంతయు ఒకరే భుజించవలయును. వెలగపండులో బెల్లమునుకలుపుకొని భుజించిన రుచికరముగ నుండుటయేకాక పైత్యహరమైనది.

## —:వెలగపండుపచ్చడి చేయువిధము:—

పండినవెలగపండును తెచ్చి పగులగొట్టి అందుండుగుజ్జుతీసి దానికితగిన పచ్చిమిరపకాయలు, ఉప్పును నూరి అందులో వెలగగుజ్జుకలిపి ముద్దపచ్చడినూరవలయును. కడపట కొత్తిమెరాకునుకలిపి అందు వేయవలయును. పచ్చిమిరపకాయలకుబదులు, నూనె, ఇంగువ మిరపకాయ వగైరాలను వేయించినూరవచ్చును.

## —:ఉసిరికాయ పచ్చడి:—

ఉసిరికాయ అన్నిటికంటె శ్రేష్టమైనపదార్థము, దీనియందు ప్రాణరక్షకపదార్థములన్నియు వున్నట్లు కనుగొనబడినది. ముఖ్యముగా విటమిన్ 'సి' ఇందు విశేషముగాకలదని శాస్త్రజ్ఞుల వచనము. ఈ విటమిన్ లోపించిన ప్రాణి—'లవణరక్తము' అను వ్యాధివల్ల బాధపడునట. కాయకల్పచికిత్సయను—ఆయుర్వేద ప్రక్రియకును ఇదియే మూలాధారమైన వస్తువుఅందురు. ప్రతిదినము దీనిని యేవిధముగనైనను భుజించుచుండిన వ్యాధిసోకదు.

ఉసిరిక పచ్చడి:—ముదిరిన ఉసిరికాయలను దెచ్చి ఒకదినము ఎండలోవేసి కాయలను కత్తితోకోసి అందుండు విత్తులనుదీసివేయవలయును. పిమ్మట కాయలకుదగిన ఉప్పువేసి, ఇనుపపొన్నులేని రోకలితో తొక్కవలయును. లేక నూరవలయును, లేక ఉసిరికాయలను ఆవిరిలో ఉడకపెట్టిన విత్తులుసులభముగ వచ్చును. అట్లుచేసినతర్వాత ఉప్పునువేసి తొక్కవలయును. ఉప్పువేసి తొక్కినపచ్చడిని జాడిలోపెట్టి నిల్వఉంచి వాడుకొనవచ్చును. ప్రతిసారి కావలసినంతపచ్చడిని తీసికొని పచ్చిమిరపకాయలతోగాని, ఎండుమిరపకాయలతోగాని వేయించిగాని పచ్చడిని నూరుకొనవచ్చును.

కొందరు ఉసిరికాయలను రోటిలోపోసి పొడిగా విత్తులతోకూడదంచి చీకటకు మూడుదినములు పెట్టి పిమ్మట ఉప్పువేసికలిపి దంచెదరు. ఇట్లుచేసినపచ్చడి చెడి బూజుపట్టును—ఉసిరికపచ్చడిని ఇనుపపొన్నుగల రోకటితో దంచిన, యినుమువలన పచ్చడి నల్లబడును. ఉసిరికాయలో మంచిలోహపదార్థమున్నది. ఉసిరిక వరుగుతోకూడ పచ్చడినినూరవచ్చును. వరుగును నీళ్లలోనాననిచ్చి, నూనెలో ఇంగువ మిరపకాయలు వగైరాలనువేయించి ఉప్పువేసినూరిన బాగుండును.

 బ్రతుకు తెరువు 

# మామిడి టెంకలలో పప్పు

నేడు భారతదేశపు సమస్యలలోకెల్ల గొప్పసమస్య ఆహారసమస్య. ఆహారపదార్థము చాలినంత లేదనుట స్పష్టమేకదా. భారతప్రభుత్వమువారు 28½ కోట్ల రూ॥ లను విదేశములనుండి ఆహారపదార్థములను తెప్పించుటకు ఖర్చుపెట్టుచున్నారు అనగా ఈ సమస్య తీవ్రత ఎంత హెచ్చుగానున్నదో తెలియగలదు.

ఈ సమస్యను గృహస్థులు ఎదుర్కొని కొంతవరకైన తమ తమగృహములలో పరిష్కరింపచేసుకొని, తద్వారా భారతదేశము మొత్తముపై నీ సమస్యా పరిష్కారము సుకరముగావించుటకు ఉపాయముల నరయవలసియున్నది.

విదేశములలో ఏనాడో యుద్ధమువచ్చును; నాడు సముద్రముల రాకపోక లరికట్ట పడును; అప్పుడు ఆహారపదార్థములరాక మందగించును అని తెలిసి-శాస్త్రజ్ఞుల సాహాయ్యమున అనేకోపాయముల అపూర్వపద్ధతిని క్రొత్తక్రొత్త ఆహారపదార్థముల నుత్పత్తి చేయుట కారంభించినారు. మామూలుగా నీళ్ల కాచుకొనుట వగైరాలకు వంటచెరకు గాను, ప్యాకింగునకును- మాత్రమే ఉపయోగపడుచుండిన రంపపు పొట్టునుండి ఆహార పదార్థమును- చక్కెరను తయారుచేసుకొన్నారు. గొర్రెబొచ్చునుండి పాలుతయారుచేసు కొన్నారు. అనేకపదార్థములనుండి ఇట్లే తినుబండారముల తయారుచేసుకున్నారు. ఎన్నో పండ్లను, కాయకూరలను, దుంపలను- వరుగులచేయుట నేర్చుకున్నారు.

మనదేశమున అంతట ప్రవీణులగు శాస్త్రజ్ఞులు లేకపోవచ్చును. కాని అనేక కాయకూరదుంపలతో విరాజిల్లు మనదేశమున ఆహారపదార్థమును ధాన్యేతరములనుండి సృష్టించుకొనవలసియున్నది. అట్టి పని "గృహలక్ష్మి" సులువుగా చేయగలదు. వాని కొన్నింటినిచ్చుట పేర్కొందును. మనదేశమున ఫిబ్రవరి-మార్చి మొదలు దాదాపు ఆగస్టు మాసమువరకును మామిడికాయలు పండ్లు, విస్తారముగానుండును. కాయలోని కండనుకోసి టెంకను ఊరక అవల పారవేయుచుందుము. పండునట్లే కోసుకొని తినియో, తాకి రసమునుచీకియో టెంక (ముట్టె) నావలగిరవాటు పెట్టుదుము. అయితే ఇందులో నుండుపప్పు మంచి ఆహారపదార్థము అని శాస్త్రజ్ఞులు కనుగొన్నారు.

ఈ పప్పులో కార్బొ-హైడ్రేట్‌స్ (Carbo-hydrates) క్రొవ్వుపదార్థములు విస్తార ముగానున్నవట అనగా-ఒకవిధమగు క్షారసంబంధమగు శ్వేతధాతువు (Crude Protein) పదార్థము 100 కి 8½ వరకు ఉన్నది; ఈథర్ యక్స్ట్రాక్ట్ (ether extract) 8 17/20 వరకు ఉన్నది; కరిగిపోగుల కార్బొహైడ్రేట్స్ (Carbo-hydrates) 74½ కు కొంచెము తక్కువగా

నున్నవి. మన ఆహారములో ముఖ్యముగానుండవలసిన పదార్థములు నీరు, ఖనిజసంబంధ మగు ఉప్పు, కార్బో-హైడ్రేట్స్, క్రొవ్వుపదార్థములు, ప్రోటీన్ (క్షారసంబంధమగు శ్వేతధాతువులు) కొంతపిప్పి విటమినులు మున్నగునవి. ఆహారమువల్లకలుగు ముఖ్య కార్యములు (1) దేహము పెరుగుట (2) దేహమందు వ్యయమైన పదార్థము పూడు కొనుట (3) దేహము చురుకుగా పనిచేయుటకవసరమైన వేడి, శక్తిపుట్టుట. ఇందు ప్రొటీనులు మాంసకృత్తుల వ్యయమును కూడదీయును. కార్బోహైడ్రేట్స్ క్రొవ్వుపదార్థము వేడిని శక్తిని పుట్టించును. ఇంతవరకు ఈ టెంకలనూరక పారవేయుచున్నారని చెప్పియే యుంటిని. వీనిని జాగ్రత్తపరచుచో మనదేశమున సాలీనా 7 కోట్లపౌనులు-జీర్ణకరములైన ప్రోటీన్ (Protein) పదార్థము, పిండితో (Starch) తో సమానమైన 78 కోట్లపౌనుల పదార్థము-లభ్యముకాగలదు. 100 పౌనుల మామిడిపప్పులో 80 పౌనుల జిటుస్ ధాన్యములో గల ప్రోటీన్‌పదార్థముకలదు; మరి-అందులో 86 పౌనుల పిండిపదార్థమున్నూ యున్నదట. కావున ఇల్లాండ్రు మామిడికాయ పండుకాలమున ఈటెంకలను వృధాగాపారవేయక-ఎండ బెట్టి పప్పుదీసి కొద్దిగావేయించి ఆహారముగా తినవచ్చును. అప్పుడు వారు తమభర్తలను- "బ్లాక్‌మార్కెట్టు"లో ధాన్యముకొని తెమ్మని వేధించనవసరముండదు. గంజాముజిల్లాలో ఖోండులను కొండజాతుల వారిదివరకే దీనిని తిననేర్చియున్నారు.

## మామిడివరుగు

పచ్చిమామిడికాయలను తరిగి కొద్దిగా ఉప్పువేసి ఎండబెట్టి నిలువ చేసియుంచినచో-పిదప కాలమున వీనిని పప్పులోను, పులుసులోనువేసి వాడుకొనవచ్చును. పచ్చడిచేసుకోవచ్చును.

## మామిడితాండ్ర

మామిడిపండ్లు కొన్ని చౌకబారువి తిన యోగ్యముగానుండవు. పండు త్వరలో చెడిపోవును. మనము కొనేవిఅయిననేమి, అంగళ్లలో విక్రయములకుంచబడునవేమి- తినున వెన్ని, చెడిపోవునవెన్ని అని చెప్పనక్కరలేదు. అయితే ఈ పండ్లరసమును విదేశముల యందు యంత్రసామగ్రిలోతీసి శర్కరాది కొన్నిపదార్థములచేర్చి గాలిదూరకుండ సీసాల డబ్బాలబిగించిపెట్టి జాగ్రత్తపరచుచున్నారు. మనదేశమును బెజవాడ మొదలగు కొన్ని ప్రాంతముల నీ యంత్రములున్నవి. అయితే పూర్వము నుంచి మనదేశమున నీ పండ్లను పండ్లరసమును జాగ్రత్తపరచి పిదప ఆహారముగా నుపయోగించుటకు సులభోపాయములను కనిపెట్టియున్నారు. ధనాఢ్యులు-జాతిఫలములను తేనెలోవేసియుంచి-పిదప కొన్నాళ్లకు భుజించేవారట.

"తేనెతోమాగిన తియ్యమామిడిపంట"అని మనముబిడ్డలకుచెప్పు పద్యములోవచ్చును.

## తాండ్ర

తాండ్రచేయుట మరొకపద్ధతి. మామిడిపండ్ల రసమును ఒక గిన్నెలోనికిపిండి అందులో కొద్దిగా చక్కెరగాని-బెల్లముగానిచేర్చి ఆ గుజ్జురసమును-చదురుపేళ్ల చదరపై గాని, క్రొత్తచేటలోగాని అలికినట్లుపూసి ఎండలోపెట్టుదురు. పండ్లు దొరుకుకొలది పూతపై పూతగాపూయుచు-ఎండలో పెట్టుచుందురు. బాగుగా-ఒకటిరెండు అంగళముల దళసరి అయినమీదట-బాగుగా ఎండినతర్వాత దానిని మెల్లగా నాచదరనుండి లేక చేట నుండి ఊడదీయుదురు. ఎండినప్పుడు సులువుగాదినవచ్చును. దానిని డబ్బాలలో నిల్వ యుంచుదురు. చిన్న చిన్నముక్కలుచేసి పెద్దలు, పిన్నలు ఉపహారముగా తినవచ్చును.

## తాటి తాండ్ర

పేదవాండ్రు తాడిపండ్లతో నిట్లే తాండ్రచేయుదురు. అసలు "తాండ్ర" అను పదమే "తాటిపండు" అనేపదమునుండి పుట్టినది.

ఆయాపదార్థములను ఇల్లాండ్రు సులభముగా తమఇండ్లలో చేసుకోవచ్చును. ఓపిక, తీరిక, అవసరముగలవారము హెచ్చుగాచేసి ధనవంతురాండ్రకు అమ్మవచ్చును. అప్పుడిది వారికి మంచి బ్రతుకు తెరువగును.

# శర్వరి



శ్రీ ఆకిలి శ్రీరామశర్మగారు

జాఱున్ జాలియుఁ గంపితస్వరములన్ జాల్కోఁగ హాహాంబూత తాం
బూరామేళనతో జతించి గమకంబుల్ పంచమాకృష్ట గాం
ధారం బంతరుపోషవహా నొక నిషాదస్థాయి నెక్కొల్ప ద
ర్బారీరాగిణి నాలపించెఁ బులకింపన్ తానసేనుండొగిన్.

సానిస, ధనిపా, మపధా, నీనిస, రిపగ మరిసా, యనెడు స్వరములసం
తానించెడు దర్బారిన్ వీనులుసొగియించు నమృతవృత్తులు దోఁచెన్

అర్ధరాత్రము కాఁ జొచ్చినది. అగ్బరుపాదుషా నిద్రాదేవ్యంకమునఁ గ్రీడించుచుండెను. లాహోరు దుర్గమున నీరవత సామ్రాజ్య మొనరించుచుండినది. ఎచటను ఎట్టి సవ్వడియు వినవచ్చుటలేదు.

రాజుదర్బారుభవనము నెదుటివైపు-ఉద్యానమునందలి రెండవభాగమున నొక చిన్న మేడగలదు. దాని పైభాగమునందలియొకచోట పారసిరత్నకంబళము పఱ్పఁబడియుండెను. దుగ్ధశ్వేతమగు దుకూలమొండందుపైఁ గప్పఁబడియుండినది. తెల్లనివెన్నెలలోనది మిలమిలమెఱసిపోవుచుండెను.

స్తబ్ధమైన సమస్తప్రకృతియు ఆరాగిణీశ్రవణతత్పరతలోనుండినది. గాలివీఁచుటనిలిచినది. కమలము కన్నుమూసి తన్మయతతో నాగానమును వినుచుండెను. సమస్తములగు పుష్పపాదపలతలు నిశ్చలముగ నాగానమును వినుచుండినవి. తానసేనుని ముగ్ధాంగుళులుగూడ విశ్రాంతినందినవి. అతని హస్తమునందలి (తానపూరా) తంబురా నిష్పందమైనది. దర్బార్యాలాపముతో దర్బారు భవనమంతయు ముఖరితమై పోవుచుండినది.

స్వరమునందు మార్దవమును వేదనయు వెల్లివిరియుచుండినది. అందులో జాఱుగమకముగల దర్బారి, ఇఁక జెప్పవలయునా! పంచమస్థాయి కెక్కిన గాంధారము రాజకుమారి శర్వరిని హఠాత్తుగ సెజ్జనుండి ఆకర్షించినది. వెంటనే కనుగొలంకులలోనికి అశ్రువులును ఆకృష్టములైనవి. ఆకసముగూడ రోదనపరాయణమైనది. ఆమె యశ్రువులు మేడక్రిందిభాగమునందలి లతికాపుష్పములపైనను గడ్డిరొనలమీదను మంచుబొట్ల యాకృతిఁదాల్చినవి. తారలతోడి చంద్రుఁడును తద్గానమువినుచు మందగతిఁ బరిక్రమించుచుండెను. సర్వత్ర నిస్తబ్ధత విరాజిల్లుచుండెను.

రాకుమారి గవాక్షమునొద్ద కిటికీనొక్కలవలంబముగానిలచినది. ఆమె కనులనుండి జలజలఅశ్రువులు వర్షించుచుండినవి. తానసేనుని దర్బారీరాగ ప్రభావమట్టిది. ఏవైపు తానసేనుని మేడగలదో ఆవైపు దత్తదృష్టియై ఆమె నిరీక్షించుచుండినది.

చంద్రికాచ్ఛన్నమగు నా శర్వరిని రాజకుమారి శర్వరి మూర్తీభవించిన సౌందర్యమోనాఁ గన్పట్టుచుండెను. మంత్రముగ్ధవలె నామె అందెంతసేపుండినదో ఎఱుఁగదయ్యెను. యౌవనలక్ష్మియట్లు యామతియు గమనపరాయణయగుచుండెను. తానసేనువిస్వరముతో సమముగ ధరణీధవునిపుత్రిశర్వరియు రోదించుచుండెను.

## 2

వెండిపళ్లెరమునఁ దాంబూలద్వయమునిడికొని తానసేనునిసేవకై దాసి బయలుదేరినది. ఆ వీడియమున;

"అమృత మయమైన మీగా
త్రము నా కబ్బంగఁజేసి తావకశిష్య
త్వమునొసఁగి యేలుకొనుమీ
తములము చేపట్టి జన్మధన్యతనందఁ"

అను శర్వరి సందేశము నిక్షిప్తమైయుండినది.

దీనికి రెండుదినముల క్రిందట:—

తానసేనుఁడు మెల్లగనడచుచు అంతఃపురప్రసాదమువఱకు వచ్చిచేరెను. చతుర్దశవర్షీయ రాచకొమిరె తొందరపాటుతోఁ గిటికీతలుపులుతెరచి క్రిందఁదారకాడు తానసేనునిజూచినది. ఆతని సుదృఢశరీరము, చక్కటి చిక్కటిమీసకట్టు, చెంపనుఁ జేరెడు కనులు, విశాలోన్నతమగు నుదురు, హైందవోచిత వస్త్రధారణముచూచి హతప్రభయట్లు చకితచకితయై శర్వరియట్లే నిలఁబడిపోయినది.

శర్వరితల్లి యొకహిందూబాలిక. ఐశ్వర్యలుబ్ధుఁడగు నామెపోషకుఁడు ఆమెనొక ముసల్మానున కమ్మివేసెను. ఆమె హిందూరక్తమున శర్వరికిపాలున్నది. ఎవఁడేనితగిన యొకహిందూయువకున కామె తన హృదయమునఁ జోటొసంగకోరుచుండెను. అందుకైయామె యపుడపుడు వికలయగుచుండెడిది. "ఆహా! హిందుత్వమా." అను నంతర్నిశ్వాసము తానసేనునిచూడఁగనే ఆమె హృదయమున కెగఁదట్టినది. వివిధవిలాసవికసితమైన ముగల్ అంతఃపురమున నివసించు నామె హృదయమున శైశవశృంఖలాబద్ధమగు వాసనాగ్ని ధగ్గుమని ప్రచండముగఁ బ్రజ్వరిల్లఁదొడఁగినది. వెంటనే కిటికీనుండి ఘల్లుమని యొకబంగరుపళ్లెము క్రిందికిఁబడినది.

తానసేనుఁడు పైకిదృష్టిఁబరపి పరికింపఁజొచ్చినాఁడు. కవిరిరంగువద్దినదియు కాళ్లవఱకు జీరాడు నదియునగు బురకామరతా నొండుధరించి, ముదురుగంధపుఁబూతపూసినదోయను భ్రమగొల్పు శర్వరి నాతఁడు కనుఁగొనినాఁడు. ఆమె దొండపండువంటి పెదవికొలఁదిగఁ గంపించుచుండెను. నేత్రములందు మదిరా మదము వ్యాపించియుండెను. తానసేనునిదృష్టి మఱియొండెడకు మరల్పబడినది. అతఁడొకపాటలకలికను వీక్షింపఁదొడఁగెను. వెండిపళ్లెరము మునుపటిదానియట్ల తిరుగపడినది. ఘల్లుమని మూడవదిగూడఁబడినది.

తానసేనుఁడు తిరుగ నా తరుణిఁజూచెఁ
బులుకుపులుకునఁ జూచుచూపుల మొదళ్ల
విశదతయు దీనతయు వెల్లవిరియుచుండె
అతఁడు స్వస్థాన విచలితుండయ్యె నపుడు.

'ఈ యంతిపురి చొరనశక్యమైనది' అని తన అసమర్థతను తానసేనుఁడు 'తలపోసికొనుచున్నాఁడని శర్వరి భావించుకొన్నది. ఆమె బిగ్గరగానవ్వినది. ఆ మఱునాఁడే వీటీద్వయముతోడి 'నీ శిష్యఁగాఁగోరు చున్నాను' అను సందేశము పంపఁబడినది.

స్వామిభక్తుఁడగు తానసేనుఁడు- "అగ్బరుపాదుషా- అంతఃపురవర్తినులతోడ ననుచితసంబంధము పెట్టుకొన నిచ్ఛగించను" అను ప్రతిసందేశముతోఁ దాంబూలద్వయము త్రిప్పివేసెను.

దాసి తిరిగివెళ్లినది. శర్వరి పిపాస వృద్ధిగాఁదొడఁగినది. పెక్కువర్షములు గడచినవి. అగ్బరు కుమారులు దానియల్, మురాదు అనువారలకు తానసేనుఁడు సంగీతమున శిక్షయొసఁగుచుండెను. తాను నేర్చిన విద్యాసర్వస్వమును సమగ్రముగవారికిఁ దెల్పుచుండెను. తన మృత్యువు వనంతరము తన కలాసంప్రదాయముల నిలఁబెట్టఁగలవాఁడు తన శిష్యులలో నొక్కఁడైనఁ దేలవలయునని అతని అదమ్యమగు నాకాంక్ష. వారిద్దఱు నతనియొద్ది విద్యాసర్వస్వము సంగ్రహించినను కరుణదర్బారీ గాయనమునఁ బూర్ణకుశలత గడింపఁ జాలరైరి.

"పానవికృతిఁ గొన్నవారి గాత్రములు; ద
ర్బారియేడ? చక్కబాడుటేడ?
నిలిచి పలుకదయ్యో
నిమోన్నతంబులై కరుణవిరియునట్టి గానలహరి"

ఆదీనభావము, వ్యథాభరితములగు నా గమకములు, కంపితములగు తానములు, పంచమస్థాయి కెక్కు గాంధారము-ఇవి యన్నియు నా తానసేనుని సహజసంపత్తి. పెరకంఠముల నావేదన, ఆ పెక్కు, ఆజాలి యెట్లు రాఁగలదు! తన యంతముతోడ తన దర్బారియు నంతరించునను దుఃఖమా తానసేనుని మిక్కిలి పీడించుచుండెను.

## 3

మఱియేడు వర్షములు గతించినవి. అది అర్థరాత్రసమయము. తానసేనుఁ దంతిమఘటికలను లెక్కించుకొనుచుండెను. దీపములన్నియు నారిపోయినవి. చీకటికి మార్గమును చూపుటకై కాఁబోలు నొక దీపపుఁబ్రమిద వెలుఁగుచుండెను. తానసేనుఁడు తనమేడలో బిళ్లదిండ్లపట్టుపరుపుపైఁ బరుండియుండెను. పాదుషాఅగ్బరు దానియల్ మురాదు లతనిచుట్టునుండిరి. అది గురువుగారి మహాయాత్రాసమయము.

ఇన్నియేండ్లు కడచనఁగా శర్వరి యతృప్తవాసనలు ప్రేమలోనికిఁ బరిణతములైనవి. ఆమెకుఁ దానసేనునియెడ స్నేహభావముకుదిరినది. అతని ప్రతివస్తువునందును ఆమె కపారప్రేమ యుదయింపఁ జొచ్చినది. అతని దర్బారియన్న ఆమెకుఁ బరమాసక్తి:—

గురువుగారి అంత్యసమయమాసన్నమైనదని విని ఆమెహృదయము విదీర్ణమైనది. ఆమె కన్నియెడలఁ జీకట్లు గోచరించినవి. కంపితములైన కాళ్లీడ్చికొనుచు వాతాయనసమీపమునకువచ్చి చేరగిలంబడినది. తానసేనుని మేడవైపు తదేకనిష్ఠఁజూచినది.

"కనుఁగొనలనుండి యశ్రువుల్ గారుచుండె
ఆపుకో నిల్పదా హృదయంపువెక్కు
వేదనయు దుఃఖమును వెల్లివిరియ నప్పు
డామెకంఠంబు దర్బారి నాలపించె"

తానసేనుని క్షీణమగు నేత్రజ్యోతి తిరుగ వికాసముపొందినది. శుష్కములగు నతని పెదవులపై స్మితరేఖ యంకురించినది. అతనిప్రియమైన దర్బారి సెవగో పాడుచుండిరి. అదియే వ్యథ, అవియే గమకములు, అదియే

పంచమస్థాయికెక్కు గాంధారము. అతఁడు సమ్రాట్టును క్షమాపణకోరెను. అందఱును వెడలిపోయిరి. వివిక్తమైనది. ఇపు డతఁడట్టి యేకత మిచ్చగించుచుండెను.

ఇపుడు తానసేనుఁడొంటరిగ నున్నాఁడు. 'బయటనుండు గాయకుని లోనికిఁ బ్రవేశపెట్టు'మని సేవకున కాజ్ఞయొసఁగబడినది. మెల్లగా తలుపు తెరవఁబడినది. తానసేనుఁడు కనులు విప్పార్చిచూచెను. ఆవచ్చిన వ్యక్తి శర్వరి. అతడు పరాకున లేవఁబోయెను. రాజకుమారి యతని సమీపమున వ్రాలినది. తానసేనుని స్వరము వణఁకిపోవుచుండెను.

'శర్వరి, క్షమింపు నే భ్రాంతి జడుఁడనైతి'

అని పల్కుటతోఁ గంఠమవరుద్ధమైనది. అతఁడు తిరుగఁబల్కెను. శర్వరీ, నేడు నేను మిక్కిలి సంతుష్టుఁడనైతిని. ఇఁక నామృత్యువు తదనంతరము దర్బారి నుజ్జీవింపఁజేసి రక్షింపఁగలవు.

'గురూ! అంతిమసమయమందైనను నాశిష్యత నంగీకరింపవలసినది.' అని రాకుమారి యేడ్చుచున్నది. "పాడవలసినది నీతోడ నేనును పాడుదును." అని పల్కుచున్న తానసేనుని కంఠము రోదించినది.

స్వరజపంచమారూఢయగు దర్బారి సమానములగు ఉభయకంఠములనుండి బయలువెడలి జనులను చకితచకితుల నొనర్చివైచినది. ఎల్లరు గురుకౌశలమును మెచ్చికొనుచు శోకార్తహృదయమున కశ్రుతర్పణమొనర్చికొనుచుండిరి. అపుడు సమస్తజగత్తు శోకసామ్రాజ్యమున విలీనమయ్యెను.

— 'సాహిత్యవారిధి' పం॥ నారాయణశాస్త్రి ఖిస్తేగారి
సంస్కృత రచన ననుసరించి—



విక్టోరియా మహారాణి - ఆల్బర్టు రాకుమారుడు 1840 లో సెంట్ జేమ్సు పేలస్ లోని రాయల్ ఛాపెల్ లో వివాహమాడిననాటి మనోహరదృశ్యం





ఎలిజబెత్తు రాకుమారి, ఫిలిప్ మౌంట్ బాటెను ప్రధానంచేసిన చిత్రం




అమ్మాయి లందరూ
ఆటలాడంగ
అన్నలకు, అక్కలకు
అందరికి ముద్దు.

వీధి పిల్లలు గూడి
వియ్య మందంగ
బొమ్మ పెండిలిచేసి
సొమ్ము లెట్టంగ

వయ్యారముగ వారు
వియ్యాలనంద
కలహించి వెంటనే
కలిసి నవ్వంగ

అమ్మలకూ, అయ్యాలకు
అందరికి ముద్దు—
కపటమెరుగని ఆట
కరగించు జడము

ముద్దులొలికెడి పలుకులు
మురిపించు మనసు
మాయనెరుగని మాట
మరిపించు మేను

అమ్మాయి.....................
.....................

కట్టెగురుగుల వంట
కమ్మన్ని వంట
ముద్దుమాటల వంట
మురిపెంపు వంట

ఆడ పిల్లలవంట
ఆటల్ల వంట
ఉప్పు వేయని వంట
ఉడుకనీ వంట

అంటు ఎంగిలిలేని
అజ్ఞాని వంట
కరువు తీర్చెడివంట
కనకంపు వంట

ఆకళ్లు తీర్చేటి
అమృతంపు వంట
అమ్మాయి.....................
.....................

ఒంటూకు విస్తారి
ఒనరంగ వేసి
పప్పుకూరలు పులుసు
పక్వాన్నములను

తృప్తిజెందితి మంచు
త్రేపు దీసేలా
అడిగింది లేదనక
వడిగ వడ్డించి

కట్నాలనిచ్చి మరి
కానుకల్ గొంచూ
ఘడియలోపల పెండ్లి
గావించుకొనిరి.

బాలవాంఛకు మరియు
బ్రహ్మకల్పనకూ
అనుకోటమేచాలు
ఆలస్యమేది? (లేక) అడ్డుఎక్కడిదీ?

బొమ్మ పెండ్లిండ్లన్న
పిల్లలాటన్నా
సృష్టిక్రమమే నాకు
స్మృతికి వస్తుంది.



# పాశ్చాత్యదేశావలోకనము

శ్రీమతి కొండ పార్వతీదేవిగారు బి. ఏ.

గత ఆగష్టుమాసమందు స్విజర్లాండులోని ఇంటర్‌లాకన్ పట్టణమందు మిసెస్ కార్బల్ ఆశబీగారి అధ్యక్షతక్రింద 14 వ అంతర్జాతీయ మహిళామహాసభజరిగినది. ఆ సభకు అఖిలభారత మహిళాసంఘ పక్షమున భారతదేశప్రతినిధిగా వెళ్లునవకాశము నాకు గలిగినది. నేను చూచిన విశేషముల తెలుప కుతూహలముగలదు.

## స్విజర్లాండు

స్విజర్లాండు పాశ్చాత్యదేశములో ప్రకృతి సౌందర్యమునవన్నె కెక్కినదై, ఆరోగ్యమునకు నిలయమై అందమగు ఉపవనములతోడను, పచ్చికబయళ్లతోను, ఫలవృక్షములతోను చిత్రవిచిత్రములగు, స్విస్ దేశీయుల నైపుణ్యతను, ప్రకటించు పూతోటలతోను, చూపరులకానందము చేకూర్చుచుండును. అచ్చట స్త్రీలు, పురుషులువలెనే దుస్తులనుధరించి, వ్యవసాయపు పరికరములను తీసికొని, వీపుమీద మూటలువేసుకొని కొండలు ఎక్కుచుండుట కనపడును. పలువిధముల రంగులపూవులతోను, పచ్చిగడ్డితోను చిత్రముగా నమర్చిన ఇంటర్‌లాకన్‌లోని గడియారమే వారికళానైపుణ్యమును చాటుచున్నది.

ఇంటర్‌లాకన్ పేరు సూచించుచున్నటుల ఆ పట్టణము రెండు సరస్సులమధ్య నమరియున్నది. ఆ సరస్సునందు ప్రతిఫలించు పర్వతశ్రేణియు అందు జూంగ్‌ఫ్రో అనగా యౌవనవతియను మంచుకొండయు కనులపండువుగనుండును. స్విజర్లాండులోని స్త్రీలు చాలకలుపుగోలుతనముగ విదేశీయులతో ప్రవర్తింతురు. వారిలో కొలదిమందిమాత్రమే ఇంగ్లీషుభాష మాట్లాడగలిగియున్నారు. పత్రికావిలేఖరులనేకులు స్త్రీలుకలరు. వారుకూడా ఇంగ్లీషుకంటె ఫ్రెంచిభాష బాగుగమాట్లాడకలిగియుందురు. అచ్చట మహాసభలో సహితము దూరశ్రవణయంత్రముతో నవసరములేక నిశ్శబ్దముగానుండును. స్త్రీలు పిల్లలను సభకులకు తీసుకొనిరారు. అచ్చట ప్రతినిధులు మాట్లాడుటకు మహాసభలను ఏర్పాటుచేసిరి. మనదేశములో ఉపన్యాసకులను పూల మాలలతో సత్కరించు నాచారముగలదుగదా ఆ దేశములో ఉపన్యాసకులకు అధ్యక్షురాలికి అందముగా చిత్రించిన శ్రేష్ఠమైన రుచ్యములైన చాక్‌లెట్లుకలిగిన కొయ్యపెట్టెలనిచ్చిరి.

స్విజర్లాండుకు బరీన్ ముఖ్యపట్టణము. క్రొత్తపట్టణము ఎత్తుగానుండి పాతపట్టణము క్రిందనుండును. అచ్చట పార్లమెంటు భవనము, అందమైన కట్టడముగలిగి, టిక్కెట్లులేకుండగనే కొన్నిదినములందు ప్రేక్షకులు వెళ్లుటకు అవకాశము కలిగియున్నది.

బరీన్‌కు సమీపముననే బాసల్ అనుపట్టణముకలదు. అందు పురాతన క్రైస్తవదేవాలయము దానిమీదచెక్కబడిన శిల్పపని ప్రశంసనీయముగనున్నవి. ఆ పట్టణమునుండి ఫ్రాన్సు, జర్మని, స్విజర్లాండు మూడుదేశముల చివరలను చూడగలుగుదుము. యీ దేశము ఘోరసంగ్రామ బాధనుండి తప్పించుకొనుట చేత భీభత్సదృశ్యములేమియు లేక, భోజనవసతులుగలిగి, ప్రజలు సుఖజీవనము చేయుచున్నారు. ఈ దేశములలో అతిధిసత్కారము చిత్రముగానుండును. మనము తోడుకొనివెళ్లిన ఓవర్‌కోటును, మన కాతిధ్య మిచ్చిన యింటి యజమానురాలు వెళ్లగానే తీసిమరల మనము వచ్చునప్పుడు తానే స్వయముగతొడుగును.

(సశేషం)

# సామెతలు



1 అరవై ఏండ్లువచ్చి చదువుకోక ఏమవుతాను?

2 అత్తలేనికోడలు ఉత్తమురాలు; కోడలులేనిఅత్త గుణవంతురాలు.

3 అత్త పగులగొట్టినకుండ అడుగోటికుండ; కోడలు పగులగొట్టినకుండ కొత్తకుండ.

4 అత్తా వక ఇంటికోడలే.

5 అత్తచస్తే కోడలుఏడ్చినట్లు.

6 ఆశపడి ఆరునెల్లు ఉపోష్యముంటే, ఆరోజున ఆరికెమెతుకులే.

7 ఆళ్లు కొత్తవైతే, తిరగళ్లు కొత్తవా?

8 అబ్బురాన అబ్బాయిపుట్టాడు; గడ్డపారతేవే చెవులుకుడదాము.

9 అంబడిపూడి అప్పయ్యాదీ బట్టతల, నామగనిదీ బట్టతల; అప్పయ్యాది ఐశ్వర్యపు బట్టతలైతే, నామగనిది పేనుకొరికిన బట్టతల.

10 ఆదివారం అందలం ఎక్కనూలేదు; సోమవారం జోలెకట్టనూలేదు.

11 ఎవరబ్బసొమ్మురా, ఎక్కెక్కి ఏడుస్తావు?

12 'నీమగనికి రాగిపోగులే' అంటే 'నీమగని కవీలేవే' అన్నదట.

13 అని అనిపించుకోకండి అత్తగారూ!

14 పోలీ పోలీ నీభోగమెన్నాళ్లు? మా అత్త మాలవాడకెళ్లివచ్చేదాకా.

15 మాలవాళ్లపెళ్లి మహాసూలుతోసరి.

[ఏవాఙ్మయానికైనా సామెతలు అమృతగుళికలు. అందులో తెలుగుదేశము సామెతలకు పుట్టిల్లు. మాపాఠకురాండ్రు ఇట్లే తమకుతోచిన సామెతలు వ్రాసిపంపుతూంటే హృద్యమైనవానినెల్లా ప్రతీనెలా ప్రచురిస్తుంటాము. గృ॥ సం॥]





# భరత మాత

శ్రీమతి కోలాహలం వెంకటనరసమ్మగారు

ఒకబిడ్డ మున్ను మృత్యువ్యాఘ్ర దంష్ట్రలజిక్క
కొను పతిం బ్రతికించు కొనెడునాడు
ఒకతనూజాత వంచకులౌ త్రిమూర్తులఁ
గుజ్జులంజేసి జోకొట్టునాడు
ఒకపుత్రి బాలభానూదయంబును నట్టె
శాపాక్షరములచే నాపునాడు
ఒకకుమారి జగత్త్రయోగ్రతఁ మండు వ
హ్నికి చల్లదనమును నేర్పునాడు

మురిసికొని పొంగిపోయిన భరతమాత
కాలవశమున భీరులౌ కానుపుగని
కంటికన్నీరు మున్నీరు గంగ నేడ్చు;
వాని దుడువని సుతులు జీవచ్ఛవములు !



## దీవెన

పండితశ్రీ బులుసు వేంకటేశ్వర్లుగారు బి. ఏ.

నరసింహాఖ్యుండు ప్రియంబునం గని మహానందంబుతోఁ బెంపఁగా,
పరివారల్ వినుతింప, వృద్ధులును వాత్సల్యంబునన్ దీవనల్
గురియింపన్, బరిపూర్ణశోభఁ గను నీకున్ భద్రతావాప్తియున్
సిరియుం, సంపద, కీర్తి, గల్గ గృహలక్ష్మీ! నీకు దీర్ఘాయువౌ!

# పరివర్తన

శ్రీమతి వెల్లంకి అన్నపూర్ణాదేవిగారు

అప్పుడే భోజనాలైనవి. గృహపనులన్నీ నివర్తించుకొని లలిత తనగదిలో కూర్చొని అప్పుడే వచ్చిన 'ఆంధ్రమహిళ'ను చూస్తున్నది. ఆమె అత్తగారైన వెంకమ్మ గారు పూర్వాచార పరాయణురాలు. ఆమెకు కోడలి పద్ధతులు నచ్చవు. అందువల్ల కోడలు బయటకు వెళ్లినదని భావించి ఆమెలో ఆమె యిలా అనుకొన సాగినది.

వెంకమ్మగారు: అయ్యో దైవమా! ఇదెక్కడి ఖర్మము. ఎప్పుడు చూచినా చదువుతునో, వ్రాస్తునో ఉంటుంది. అదీ ఇదీగాకపోతే మీటింగులని తిరుగుతుంది. సిగ్గువిడచి పరాయి మొగాళ్లతో మాట్లాడుతుంది. మాయింటి గౌరవమర్యాదలన్నీ మంటకలిపింది.

యింతలోనే పొరుగింటి గౌరమ్మ వస్తూనే 'ఏమో! వదినా ఒక్కదానివే ఉన్నావు. కోడలు లేదా ఏమిటి, మీటింగులకని ఎక్కడకైనా వెళ్లినదా?' అన్నది.

వెంకమ్మ:(దుఃఖముతో) ఏంచెప్పను వదినా? మానాభిమానాలు అన్నీ విడిచేసింది. అసలువాడు మంచివాడైతే దానిని అనే పనేముంది. 'ఏంరా? అబ్బాయి' అంటేనవ్వి ఊరుకుంటాడు. భార్యను అదమాయించడు. 'అని కళ్లవెంట నీరుకారుస్తుంది.'

గౌరమ్మ: (వయ్యారంగా) నీకేమే వదినా. చదువుకున్నది. అన్నీ తెలిసింది.

వెంకమ్మ: (ఏడుస్తూ) ఏడేడు పద్ధానుగు తరాలకి యిలాంటి కొరివివద్దు తల్లీ. నావిరోధులకు కూడా యిలాంటి కోడలిని ఇవ్వవద్దు అని ఆయీశ్వరుని ప్రార్థించు చున్నాను.

గౌరమ్మ: ఇప్పుడిలా అంటున్నావుగాని వదినా! నేను మొదటనే చెప్పలా, చదుకున్నదానిని చేసుకొంటే ఒక విధానరాదని. ఆ నాగమ్మను చేసుకొంటే నీకింత అండా దండగా ఉండేది! నాగమ్మ వాళ్లత్తను వంగుని చీపురి ముట్టుకోనీయదు.

వెంకమ్మ: (మరింత దుఃఖముతో) నాకు సుఖపడే గీతలేదు తల్లీ. (కొంచెసే పూరుకుండి) సరే! యీ ఇంట్లో అదాయినా ఉండాలి లేదా నేనైనా ఉండాలి, వాడిని రానీ, ఏదో ఒకటి తేల్చుకొంటా.

వారిద్దరి సంభాషణ లలిత విన్నది. లలిత కాపురాన్కి వచ్చి సంవత్సరమైనా కాలేదు. ఆమె విద్యావంతురాలు. చదువుకునే దినములలో ఆమె తన జీవితాన్ని దేశ సేవకు, తన తోటిసోదరీమణుల సేవలోను అర్పించాలని తలంచేది. వివాహమయిన వెంటనే తన భావాలకు స్వస్తిచెప్పి, సనాతన పరురాలైన అత్తగారి ఆజ్ఞలకు లోనై ఉండాలని ఎప్పుడూ భావించలేదు. అయినప్పటికి విద్యావతి గనుక ఇంటిపను లన్నీ తానే చక్కపెట్టుకొని, తీరిక సమయములో తన తోటిసోదరీమణులకు పత్రికలోని వార్తలు, స్త్రీల సమస్యలను గురించి చెప్పేది. కాని అత్తగార్కి యివన్నీ ఏమీ నచ్చేవి కావు. వీరిద్దరి సంభాషణ విన్ననాటినుండి మరింత దీర్ఘాలోచనలో పడ్డది.

ఆదినము నుండి ప్రతి ఒక్కపని లలితయే చేయసాగినది. ఇంట్లోని నౌకర్లను ఏమీ చెయనీయటములేదు. ఇంటిపనులన్నీ ముగిసిన తర్వాత తీరికసమయములో సంభాషణలో పత్రికలలోని వార్తలు, మన దేశపు స్త్రీలు, ఇతర దేశపు స్త్రీలను గురించి నెమ్మది నెమ్మదిగా రోజూ అత్తగార్కి చెప్పేది. ఒకదినమున లలిత అత్తగారితో

ఒక పట్టణములోని స్త్రీలంతా ఆర్థిక స్వాతంత్ర్యము కావాలని, హిందూచట్టాన్ని స్త్రీలకు న్యాయము కలిగించేదిగా మార్చవలసినదిగాను అడగటానికి ప్రభుత్వము దగ్గరకు ఊరేగింపుతో వెళ్లారని చెప్పినది. యీవిషయం వెంకమ్మగారికి ఆశ్చర్యంగా తోచినది. 'ఏమే లలితా? మొగాళ్లు లేకుండా ఆడాళ్లే వెళ్లారు. సరేకాని చట్టము అన్నావు ఏమిటి?' అన్నది.

లలిత: (సంతోషభరితురాలై) మన స్త్రీలకు ఆస్తిమీద హక్కు లేదు. అందువల్ల ఎవరో ఒకరిమీద ఆధారపడి వుండవలసి వస్తున్నది. ఏదైనా మంచిపని చేద్దామన్న చెయ్యలేకుండా ఉన్నాము. అందుకని మనదేశంలో చాలా సంవత్సరముల నుండి స్త్రీలు, తండ్రి ఆస్తిలో సోదరులతోబాటు సమాన వాటాలు కావాలని; ఒకభార్య ఉండగా ఇంకొక భార్యను ఏపురుషుడు చేసుకో కూడదని, కుటుంబము సమిష్టిగా నున్నప్పుడు భర్త చనిపోతే అతను వాటా భార్యకు పంచుకొనే హక్కుండాలని ఆందోళన చేస్తున్నారు.

రెండవదినమున ఉదయముననే పొరుగింటామె గౌరమ్మ వస్తూనే 'వెంకమ్మ వదినా! కోడలున్నదా, ప్రచారానికని వెళ్లినదా? రేపు మాపిటికి మనవూళ్లో మీటింగుటగా. ఏం పోయేకాల మొచ్చినదోగాని, మొగాళ్లుంటారని భయమన్నా లేకుండా నడివీధులో మీటింగు పెట్టి ఆడాళ్లు మాట్లాడుతారట!

వెంకమ్మ: (నవ్వుతూ) అవును వదినా! మీటింగు జరుగుతుందని మా లలిత నిన్ననే చెప్పినది. తెలియక నేను మొదట లలితను నానాబాధలు పెట్టాను. కాని అది సుగుణసంపన్నురాలు. రోజూ నాకు వార్తలు, స్త్రీల విషయాలు చెబుతుంది. నీవు కూడా విందువుగాని: ఉండు. 'ఏమే లలితా! ఒకసారి ఇలారా! గౌరమ్మ వదినకు నిన్న నాకు చెప్పావే ఆసంగతి చెప్పు' అన్నది. లలిత నవ్వుతూ మీపెద్దల సహాయము మాకు తప్పకుండా కావాలి అని హిందూ న్యాయశాస్త్రంలోనున్న లోపాలను, స్త్రీలు సూచించుతున్న సవరణలను చెప్పినది.

లలిత చెప్పిన విషయాలు గౌరమ్మకు కండ్లకు గంతలు కట్టినట్లుగా కనపడ సాగినవి. హిందూన్యాయశాస్త్రంలోనున్న అవకతవకల వల్ల స్త్రీలు ఎలా బాధ పడుచున్నది ఆమెకండ్ల ఎదుట కనపడసాగినవి. గౌరమ్మకు ఒకే కూతురు. ఆమెకు చిన్నతనంలోనే వివాహమైనది. మసూచిక మహామారి ఆబిడ్డ భర్తను కబళించినది.

వియ్యాల వారు సంపన్న గృహస్థులు కాని, గౌరమ్మ కూతురుకు మనోవర్తి ఇవ్వటాన్కి గూడా నిరాకరిస్తున్నారు. లలిత మాటలు గౌరమ్మ హృదయములో నాటుకొన్నవి. అయితే 'లలితా! రేపు ఇవన్నీ చెప్పుతారుగా తల్లీ. మీరుచేసే పనులు సరిగా తెలియక మొదట ఎన్నో అపోహాలు పడ్డాము. రేపు మాకోడలిని కూడా తీసుకు వస్తాను'.

ఆదినము ఏకాదశి. లలిత అత్తగార్కి పూజాద్రవ్యములను అందించటములో నిమగ్నురాలైనది. వెంకమ్మగారు 'లలితా అప్పుడే ఒంటిగంట అయినది. మూడుగంటలకు మీటింగుకి వెళ్లాలినీవు, కనుక భోంచేసి, కొంచెము సేపు విశ్రాంతి తీసుకో తల్లీ. నావక్కడానికేగాక వెయ్యిమంది స్త్రీలకు సేవ చేసేదానవు' అన్నది. అత్తగారి ప్రేమ పూరితమైన మాటలకు లలిత పరమానందభరితురాలైనది. తనలో తాను యీవిధముగా తలచినది. 'మానవ ప్రయత్నమునకు ప్రపంచములో ఏదీ అడ్డులేదు'.






పశ్చిమ గోదావరిజిల్లా నర్సాపురంలో 1947 వ సం॥ అక్టోబరు 12 తేదీన

## శ్రీమతి ఈడుపుగంటి రత్నమాంబగారి

### అధ్యక్షోపన్యాసము.

### దేశసేవికాస్మృతి

భారత మహిళోద్యమంలోను, జాతీయరాజకీయాదిరంగాలలోను తమకున్న అవకాశాలలో శక్త్యనుసారము పనిచేసి, నారీలోకాభివృద్ధికి తోడ్పడి, దివంగతులైన సోదరీమణు లెవ్వారిని మనం విస్మరించజాలము.

ప్రాక్పశ్చిమ పంజాబురాష్ట్రాల, ఢిల్లీనగరాలలోని మానవతులైన మనహిందూ, శిక్కు, మహమ్మదీయ సోదరీమణుల దుర్భరకష్టాలు బలవంతమతాంతరీకరణాలు, మానభంగాలు, ప్రాణనష్టాలు, సర్వనాశనాలు మన చిత్తస్థైర్యాన్ని మంటకలుపుతున్నాయి. ఇక్కట్లలోనున్న మన సోదరీమణులకు మనహృదయపూర్వక సానుభూతి.

హైదరాబాదు సంస్థానరంగంలో యమయాతన లనుభవిస్తున్న మనసోదర, సోదరీమణులందఱి దుఃఖాలు మనదుఃఖాలే అని మనంఎంచుతూ, నిజాం వారి గూండాకింకరులు సాధ్వీమతల్లులైన ఆ రాష్ట్ర సోదరీమణులకు గావిస్తున్న ఈ వర్ణనాతీతమైన అపచారములకు తీవ్రప్రతీకారము ఈ నరహంతకులకు, రాక్షసులకు జరిగేవఱకు మనం విశ్రమింపజాలం.

### స్త్రీవిద్య

సర్వశాస్త్రాలను, కళలను పురుషులతో సమానంగా అభ్యసించడమేగాక, మనగృహాన్ని రసాత్మక ఆనందవాటికలుగా మార్చే సంగీతం, సాహిత్యం, లలితకళలు, పాకశాస్త్రం, వృత్తివిద్యలు, ప్రసూతి, శిశుపోషణ శాస్త్రాలలో ప్రత్యేకవిజ్ఞానోపార్జన మన కత్యంతావసరం. ఈ కృషిలో మన విశిష్టత, ప్రత్యేకత నిరూపించి, మనం జ్ఞానధనులం కావాలి.

### ఐక్యమహిళోద్యమం

ఇప్పుడు దేశంలోవున్న వాస్తవికపరిస్థితులలో మనఅజ్ఞానంవల్లనూ, బలవంతునిదే రాజ్యమైనందుననూ స్త్రీలసాంఘిక, ఆర్థికాదిహక్కులు చాల లోపభూయిష్ఠంగాఉన్నవి. అందుకుసంబంధించిన చట్టాలు, ఆచారాలు పూర్తిగామారాలి. మనమా పరిస్థితులను జయప్రదంగా ఎదుర్కోవాలంటే, మనమంతా ముక్తకంఠంతో తీవ్రాందోళన చాలాకాలం జరిపితేనేగాని ఈ పరిస్థితులు కుదటబడవు. అటువంటప్పుడు మహిళోద్యమం ఒకత్రాటిమీద నడవవలసిన ఆవశ్యకత ఎంతోఉంది. అంతర్జాతీయవిఖ్యాతిగాంచిన డా. సరోజినీనాయుడు, పండిట్ విజయలక్ష్మి, కమలాదేవి, రాజకుమారి అమృతకౌర్, హంసామెహతావంటి ప్రముఖురాండ్ర అధ్వర్యాన నడుస్తూవున్న అఖిలభారతమహిళాసంఘ ఛత్రచ్ఛాయలక్రింద పనిచేయడంకంటె మన కింకా విశిష్టమైన పంథా ఏముంటుంది? మనరాష్ట్రంలో ఇప్పుడు అనేక కారణాలవల్ల ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ చీలివున్న మహిళాసంఘాలన్నీ ఏకోన్ముఖమై నారీలోకోద్ధరణకు పూనుకోవాలని మన సోదరీమణులకు విన్నవిస్తున్నా.

దిః 21-11-47 న రాజమండ్రిలో తూర్పుగోదావరిజిల్లా సభాధ్యక్షురాలు

'సంఘసేవాపరాయణి'

# శ్రీమతిచుండూరి రత్నమ్మ జమీందారిణిగారి అధ్యక్షోపన్యాసము

మతకలహాల పేరిట జరుగుతున్న మహిళామతల్లుల మానభంగాల చరిత్ర భారతమహిళాలోకానికి తలవంపులు తెస్తున్నది. ఈనాడు మహిళగా జీవించివుండటమే ఒకగొప్ప దౌర్భాగ్యమేమో అనిపిస్తున్నది. మనపొరుగుసంస్థానమైన నైజాంలో మనసోదరీ మహిళాలోకానికి జరుగుతున్న అవమానాలు మనలను మరింత చలింపచేస్తున్నై.



పవిత్రమైన మతంపేరిట యిట్టి పైశాచికకృత్యాలు సాగిస్తూన్న మతోన్మాదులకందరకూ నేనొక హెచ్చరిక చేయదలచుకున్నాను. స్త్రీలను సంక్షోభపరచి యెవ్వరూ యెన్నడూ ముందుకురాలేదు. ద్రౌపదీదేవిని నిండుసభలో పరాభవించి, మానభంగంచేయ ప్రయత్నించిన దుర్యోధనుడు సమూలంగా నాశనమైపోయాడు. నేటి మతోన్మాదులకు అట్టిగతియే సంప్రాప్తము కాబోతున్నది.

మన మహిళోద్యమ కృషిఫలితంగా భారతమహిళాలోకంలో వెనుకటికన్న యిప్పుడు చాలా చైతన్యం కలిగింది. జీవితంలోని అన్నిశాఖలలోనూ స్త్రీలు నేడు ఉత్సాహంతో ముందుకువస్తున్నారు. స్త్రీ విద్య కూడా నానాటికీ వృద్ధిచెందుచున్నది. ప్రజాహిత కార్యాలలో పురుషులకు ఏమాత్రం వెనుకబడకుండా స్త్రీలుకూడా త్యాగాలుచేస్తున్నారు. స్త్రీ లోకంలో ఏర్పడిన ఈ చైతన్యాన్ని స్వాతంత్ర్యసంగ్రామంలో భారతమహిళ నిర్వహించిన ప్రముఖపాత్రను దేశంకూడా ఈనాడు గుర్తించింది. సోదరి విజయలక్ష్మీపండిట్ రష్యా రాయబారిగనూ, భద్రతాసంఘానికి భారతరాయబారవర్గ నాయకురాలుగానూ నియమింపబడటం, సోదరిసరోజనీదేవి సంయుక్తరాష్ట్ర గవర్నరుగా నియమితురాలు కావడం, సోదరికమలాదేవి కాంగ్రెస్సు కార్యవర్గ సభ్యురాలుగా ఎన్నుకొనబడటం, సోదరి రాజకుమారీ అమృతకౌర్ కేంద్రప్రభుత్వ మంత్రిణిగా ఏర్పాటుకావడం ఇవన్నీ నిజంగా భారతమహిళలమైన మనకందరకూ గర్వకారణాలు. స్త్రీవిద్యా, స్త్రీ స్వాతంత్ర్యము మొదలైనవాటి ఆవశ్యకత గురించి ప్రబోధం చేయవలసినకాలం గతించిపోయింది. ఇప్పుడు సర్వేసర్వత్రా మనసిద్ధాంతాలు ఆమోదింపబడుతున్నై. ఇవన్నీ మనం సంతోషించదగిన విషయములే! కాని యింతటితో మనకర్తవ్యం అయిపోయిందని చేతులుముడుచుకొని కూర్చునేందుకు వీలులేదు. మన మహోన్నతమైన ఆశయాలలో ఆవగింజలో 60వ వంతైనా మనం సాధించినట్లుకాదు. వెనుకటికన్న యెంత మెరుగని మన మనుకున్నా స్త్రీవిద్య యింకాయెంతో అభివృద్ధికావలసివుంది. ఇంకా అనేక రంగాలలో స్త్రీలు తమసామర్థ్యమును ప్రదర్శించి జాతీయ సౌభాగ్యాన్ని పెంపొందింప చేయవలసిఉంది.

కాంగ్రెసు ప్రభుత్వాలు అధికారంలోనికి వచ్చినతరువాత స్త్రీ సమస్యలనుగూర్చిన శాసనాలుచేయటానికి శక్తివంచనలేకుండా కృషిచేస్తున్నందుకు మనం వారిని అభినందించవలసివున్నది. బహుభార్యాత్వ నిషేధచట్టమూ, దేవదాసీల చట్టమూ మొదలయినవెన్నో స్త్రీలోకముయొక్క సౌభాగ్యాన్ని దృష్టిలో వుంచుకొనే చేయబడుతున్నై. సంకల్పము మంచిదే అయినా, ఆచరణలో ఈశాసనాలు యేలాపనిచేస్తాయో వాటికి సవరణలు యేమైనాచేయవలసిన ఆవశ్యకతవున్నదేమో అనేవిషయములన్నీ తీవ్రంగా ఆలోచించి ప్రభుత్వానికి సలహాలు యివ్వవలసినబాధ్యత మన మహిళాసభలవంటి సభలమీదవుంది. ముఖ్యముగా స్త్రీ జాతికి ఆర్థికస్వాతంత్ర్యంకలిగిస్తూ ప్రభుత్వం శాసనాలు చేసేటట్లుకూడా మనం వొత్తిడిచేయాలి.

భారత మహిళాభ్యుదయంయొక్క ఆవశ్యకత చాలావరకు గుర్తింపబడినమాట నిజమేగాని, ఇప్పటికీ ఇంకా భారతమహిళకు జరుగవలసినంత న్యాయంమాత్రం జరగటంలేదు. పట్టణజనసంఖ్యలో చెరి సగంగా స్త్రీలు ఉన్నప్పటికీ పురపాలకసంఘాలలో ఏ ఒకటి, రెండుస్థానములు మాత్రమే స్త్రీలకు ప్రత్యేకించబడుతున్నై ప్రజాప్రతినిధి సంస్థలన్నీ ఇదేస్థితిలోవున్నై. స్త్రీలకు తమజనసంఖ్య నిష్పత్తిననుసరించి ప్రాతినిధ్యం లభించటంలేదు. ఈ విషయాలన్నీ క్రోడీకరిస్తూ చెన్నరాష్ట్ర స్థానికస్వపరిపాలన శాఖామంత్రికి నేను జాబువ్రాశాను. ఈ విషయమై ప్రభుత్వం ఏమి ఆలోచిస్తున్నది ఇంకామనకు తెలియదు. ఈ అన్యాయాన్ని అనతికాలంలోనే గుర్తించి ప్రభుత్వం స్త్రీ జాతికి ప్రజాప్రతినిధి సంస్థలలో తగినంత ప్రాతినిధ్యం కలిగించే విధంగా మనం ఆందోళన జరపాలి. సాధారణ స్థానాలలో పోటీచేసి అన్నిస్థానాలను స్త్రీలే గెల్చుకో వచ్చునుగదా అనే వాదానికి అర్థంలేదు అలాంటప్పుడు స్త్రీలకు కొన్నిస్థానములు ఎందుకు ప్రత్యేకించవలసి వచ్చిందని నేనడుగుతున్నాను.

స్త్రీ శక్తిస్వరూపిణి స్త్రీల మేధశ్శక్తియొక్క సహాయసంపదలేకుండా ఏ ఉద్యమంకానీ సర్వతోముఖమైన అభివృద్ధి పొందజాలదు పురుషుడనే బాటసారికి స్త్రీ త్రోవచూపే దివ్వెవంటిది. పురుషుడనే పుష్పగుచ్ఛానికి స్త్రీ నెత్తావివంటిది. స్త్రీ లోకము నశ్రద్ధచేసిన ఏ జాతి పరిపూర్ణతను పొందజాలదు.

ప్రస్తుతం దేశంలో ఏర్పడిన ఈ క్లిష్టపరిస్థితులలో మన కర్తవ్యమేమిటని మనం ప్రధానంగా ఆలోచించుకోవాలి. కష్టసమయంలో కర్తవ్య నిర్వహణకు వెనుకాడకూడదు. స్త్రీ 'అబల' అనేమాట అర్థరహితమైంది. మహాసంగ్రామాలలో పాల్గొని వీరోచితంగా పోరాడిన రుద్రమదేవీ, ఝాన్సీ లక్ష్మీబాయి మొదలైన వీరాంగనల ఆదర్శాన్ని మనం అనుసరించాలి.

ఈ రోజులలో ఆత్మరక్షణనిమిత్తం ప్రభుత్వంమీదగాని, మరేఇతరులమీదగాని ఆధారపడి ప్రయోజనంలేదు. మనమానప్రాణాలను మనమే రక్షించుకోగల స్థితిలో మన ముండాలి. దీనికి గ్రామగ్రామములలోనూ, పట్టణపట్టణములలోనూ, వాడవాడలలోనూ, దేశసేవికాదళములు యేర్పడి, కత్తి, కర్ర, సాములలో తరిఫీదుపొందటం చాలాఅవసరం. అప్పుడు మన గృహాలనూ, ప్రాణంకన్నా అధికంగాచూచుకొనే మానమునూ మనము కాపాడుకోగలుగుతాం. ఎంతమాత్రం కాలహరణచేయకుండా ఇక్కడ సమావేశమైన మహిళామణులందరూ ఇట్టి దేశసేవికాదళ నిర్మాణానికి కృషిచేయవలసినదని నేను కోరుతున్నాను.

లేశమాత్రమైనా కార్యరూపంలోకి తేగలిగిననాడే ఇట్టి సభలు సార్థకమ్ములౌతాయి. అంతేగాని సంవత్సరానికొకమారు సమావేశమై వినోదంగా ఏవేవో ఉపన్యాసాలు చెప్పుకుని, మరుక్షణమే సర్వమూ మరచిపోయినందువలన ఏమీ ప్రయోజనంలేదు.



# లేఖలు

ఆర్యా!

‘గృహలక్ష్మి’ సెప్టెంబరుసంచికలో ఆంధ్రపతివ్రతలకు హెచ్చరిక అనే శీర్షికక్రిందపడిన పద్యములు స్త్రీయొక్క హృదయాలను కలచివేయకుండా వుండలేవు. గౌరవనీయుడైన వ్యాసకర్త స్త్రీమూర్ఖచిత్తగా ప్రకటించదలచుకోవడం చాల శోచనీయం. స్త్రీఅంటే ఈకాలంలో యుక్తాయుక్త విచక్షణలేనివస్తువుకాదు. ఆమెకు సామానుల నుపయోగించి గృహ భారాన్ని నిర్వహించడం, ప్రతిభనుపయోగించి దేశౌచిత్యాన్ని కాపాడటం, తెలిసినట్లే చట్టాలను సద్వినియోగపర్చుటకూడా తెలుసు. స్త్రీలకు విడాకులచట్టము వచ్చినంత మాత్రాన అపవిత్రలగుటకు ఆధారమేమిటి? వారు పతివ్రతల నుదాహరణిస్తూ సీతాదమయంతులను ఎత్తుట చాల ముదావహము. ఆయన అవిధంగానే శ్రీరామచంద్రుని, నలమహారాజులనుకూడా వుదాహరణగా నిచ్చిన పక్షపాతబుద్ధి లేకుండెడిది. సీత రామునికేవిధంగా హృదయాన్ని అర్పించిందో రాముడుకూడా సీతకావిధంగానే హృదయాన్ని అర్పించాడు. శ్రీరామచంద్రుడు ప్రజాసేవకుడగుటచే చాకలినిందవలన సీతను అడవికిపంపింది తన రాజకర్తవ్య నిర్వహణకేకదా? ఆమెను అడవికిపంపి ఆయన సర్వసౌఖ్యాలతో తులతూగుతున్నప్పటికికూడా సర్వస్వమూ కోల్పోయినట్లు ఎందుకు దుఃఖించుతూ తన జీవితాన్ని సౌఖ్యరహితంగా గడిపాడు? ఆయన కింకొకవివాహము చేసుకోవహక్కులేకనా? తనహృదయాన్ని సీతకర్పించుటచేతనేకదా! రాజభవనములో తను నివసిస్తున్నప్పటికి వెనుకటిరోజులలో సీతతోగడిపిన పర్ణకుటీరపు సౌఖ్యాలనే అత్యంతసుఖదాయకాలుగా తలపోస్తు వుండేవాడు. ఆయన అత్యంత దైవస్వరూపుడైన గురు వశిష్టునియొక్క ఆజ్ఞానుప్రకారం అశ్వమేధయాగము చేయుటకు తలపెట్టాడు. వశిష్టుడు శ్రీరామచంద్రుని మనస్సుశాంతియుతం చేయటానిక్కి అశ్వమేధయాగం చేయించుటకు స్త్రీకావలయునుగదా! ఈవిధంగానైనా రెండవవివాహం చేసుకొని శ్రీరామచంద్రుడు సౌఖ్యపడతాడనేవుద్దేశ్యం తలపెట్టి, యాగసంభారమంతయు పూర్తియైనపిమ్మట సహభాగినియైన స్త్రీలేనిదే యజ్ఞంపూర్తికాదని బలవంతపెట్టి నప్పటికీకూడ దైవస్వరూపుడైన గురుయాజ్ఞనైనా సునిశితంగా ధిక్కరించాడుగాని, సీతనుమాత్రం తనపవిత్రహృదయంనుండి తొలగించలేకపోయాడు. శ్రీ శ్రీరామచంద్రుడు శ్రీ సీతాదేవికిచ్చిన గౌరవస్థానాన్ని నేడెంతమంది పురుషులు తమ అర్ధాంగులకిచ్చి గౌరవించుతున్నారు? శ్రీరామచంద్రునివలె హృదయాన్నిచ్చిన పురుషుని ఏభార్యయు విడాకుల ఆయుధాన్ని అవివేకంగా వుపయోగించదు ఈనూతన శతాబ్దంలో చట్టాలనుపయోగించుకోవటంచేతగాని స్త్రీలరుదు. దమయంతీదేవి తనభర్త అడవులలో వదలిపెట్టిపోయినప్పటికీ ఆయన్నే దైవంగాభావించిందని రూపించేముందు నలమహారాజుయొక్క పవిత్ర హృదయాన్నికూడా గుర్తుకుతెచ్చుకోవటం చాలముఖ్యావసరం.

ఆనలచక్రవర్తి తన ప్రాణప్రియమైన దమయంతీదేవి కష్టాలముందు తన స్వకష్టాలనుమరిచిపోయి ఆమెయొక్క బాధలనుచూడలేక తనుకనుపించకపోతే విధిలేక కన్నవారింటికి వెళ్లుతుందని వదలివెళ్ళాడు కాని ఆమెనుపోషపుచ్చుటకు కాదుకదా! దమయంతికూడా కన్నవారింటికివెళ్ళి భర్త్రాన్వేషణచేస్తూ ఆకార్యక్రమంలోనే ఒకసాధనంగా ద్వితీయ స్వయంవరము ప్రకటించిందికాని తనకు పురుషసౌఖ్యము కొరకు ఆ అధికారాన్ని వినియోగించుకోలేదు. ఈ సంగతి నలచక్రవర్తికి తెలియకపోయినా ఆయన తన ప్రేమను వశవర్తినిచేసుకోలేక ఈవిధంగానైనా దమయంతీదేవిని చూడటాన్కి వచ్చారుకాని తనపురుషాధికారాన్ని ఆమెమీద వినియోగించి ఆమెను నిరంకుశంగా స్వాధీనపర్చుకోవాలని ఆయనకోరలేదు. ఇలాంటి స్వార్థత్యాగులు, ప్రేమపిపాసువులు నేటిపురుషులలో ఎంతమందివున్నారు. అలాంటిప్రేమ పిపాసువులైన భర్తలయెడ ఏమూర్ఖస్త్రీకూడా ఈచట్టాన్ని ప్రయోగించదని స్త్రీజాతిపట్ల నేనావ్యాసకర్తకు హామీఇస్తాను. సీతా, దమయంతుల నాదర్శంగా తీసుకొని, అలాంటిభార్యలు కావాలని పురుషులు తపిస్తుంటే, శ్రీరాముడు, నలచక్రవర్తిలాంటి భర్తలుకావాలని స్త్రీలు కోరుకోవటంలో తప్పేముంది. దుష్యంతుడు శకుంతలను ప్రేమించి ఆమెనుమర్చిపోలే! ఆమె ప్రేమతో అతన్నినమ్మించలేకపోతే ఆకాశవాణిసాక్షీభూతమై ఆభార్యాభర్తల దాంపత్యానికి తోడ్పడింది. నేడనేకమంది స్త్రీలు భర్తలకు హృదయాలని అర్పించి వారిహృదయాలను పొందలేక తమ జీవితకాలమును దుఃఖభాజనం చేసుకుంటున్నారు. ఏపవిత్రప్రేమతో ఐతే స్త్రీపురుషుని వశవర్తిని చేసుకుంటుందో, ఆపవిత్రప్రేమతో పురుషుడు స్త్రీని వశవర్తిని చేసుకోలేడా? విజ్ఞానసాధనకు నేటిసంఘంలో పూర్తిఅవకాశాలున్న పురుషులు పవిత్రప్రేమయొక్క ఆవశ్యకతనుగురించి అన్నివిధాలా వెనుకబడివున్న స్త్రీలకు మానసికప్రవర్తనకల్గించి పాతివ్రత్యమహిమను తెల్పాలి; కాని అమాంతంగా, సీత, దమయంతుల్ని వుదాహరణాలుగాచెప్పి విడాకుల చట్టాల్ని నిరోధించిన గోడచాటు పాతివ్రత్యాన్నితప్ప పవిత్రపాతివ్రత్యాన్ని నెలకొల్పలేరు. నేటిసంఘం విడాకులచట్టం లేకుండా సంఘంలో స్త్రీల అవినీతిని ఎంతమాత్రం తొలగించగల్గింది? అది విజ్ఞాన వికాసాలున్న మానవులను వృద్ధిపర్చి, భర్తకు భార్యయెడలవున్న దురహంకారాన్ని రూపు మాపుటకు తోడ్పడుతుంది. విడాకులచట్టం స్త్రీలకు పాతివ్రత్యాన్ని పోగొట్టక పోవడమేగాకుండా దాన్నిధృఢపరచి అవినీతిని వ్యభిచారాన్ని తుదముట్టించుతుంది. విడాకులచట్టాన్నిఅధవా ఏకొద్దిమంది స్త్రీలో దుర్వినియోగించేస్తే, స్త్రీసమాజం ఆస్త్రీలను తగురీతి సంస్కరిస్తుంది. హిందూస్త్రీలు దాంపత్య ఐకమత్యంలేనివారు తమభర్తలు రెండవవివాహం చేసుకుంటే తమకుకూడా వివాహేచ్ఛ నశించకపోవుటచే మతాంతరులై తమకోరికలను సాఫల్యంచేసుకుంటున్నారు. అంతమాత్రంకూడా విజ్ఞానంలేనివారు అవినీతిగా ప్రవర్తిస్తున్నారు. నిగ్రహంవున్న స్త్రీలు పుజ్యార్హులేగదా. స్త్రీలు చపలచిత్తలని వీలున్నంతమాత్రాన అవినీతిపాలవుతారనే వుద్దేశ్యం గౌరవనీయుడైన వ్యాసకర్త అసత్యమనితలుస్తారని భావిస్తాను.

—అల్లూరు హైమవతీదేవి.



# చిత్ర ప్రశ్నలు

## ౧

సీ॥ భారతావనియొక్క ప్రత్యేక కీరితి
నిలిచె నెవరివలన నేటివఱకు
పూర్వహైందవనారి పూనె నెద్దానిని
భక్తిముక్తికొఱకు పథమటంచు
రెండిటికినిజూడ మూడక్షరంబుల
నామమలరవలయు నయముగాను
మొదటిపేరులోని మధ్యక్షరంబును
పిదపనామమందు తుదియువీడి

గీ॥ చెలగినాల్గక్షరంబులు చేర్చిచదువ
పూర్తియైనట్టియర్థంబు పొందవచ్చు
చాకచక్యంబుగలయట్టి చానలెల్ల
చెప్పుకొనరమ్మ మీనేర్పు మెప్పుగొనగ.

## ౨

ఆ॥వె॥ పొలముదున్న నేగె పుత్రుండు, తండ్రియు
తల్లి, కూతురెలమి తట్టతోడ
చలిదిగొంచుబోయి సరగునఁబిలచిరి
'బాబుబువ్వ!' 'రార! బాబు బువ్వ!'

అనుచుబలికినట్టి యాసతులిర్వురు
ఎవరి నెవతె బిలచె నేదివరుస
తెలియబల్కవలయు తెరవలిందునగల్గు
వారివారియొక్క వావులెఱిఁగి ॥

— వి. కామేశ్వరమ్మ

[పై ప్రశ్నలకు జవాబులు పంపుటలో ప్రతి గృహలక్ష్మి పాల్గొనవచ్చును. గృ॥ సం॥]

జవాబులు యీనెలాఖరులోగా చేరాలి.

# స్త్రీ సమస్యలు



ప్రశ్న:—వివాహానికి స్త్రీకి 18 సంవత్సరాలకి తక్కువఉండకూడదనీ, పురుషునికి 45 పైని ఉండకూడదనీ బొంబాయి ఎసెంబ్లీలో బిల్లు పెట్టాలనుకుంటున్నారుట. నేనిది అన్యాయంఅంటాను. మీరో?

జవాబు:—మీ రెందుకు అన్యాయం అంటారో నాకుతెలియదు కాని నేనూ అలాగేఅంటాను. ఏమంటారా స్త్రీపురుషులమధ్య వివాహానికి 27 సంవత్సరాలతేడా ఉండవచ్చునని కనిపిస్తోంది. దీనిలో ఉండితీరాలని కాదు. కాని వయస్సుమాటెందుకూ? అంటే-సరదాలలోనూ, విలాసాలలోనూ, భావాలలోనూ వయస్సుముదిరినకొద్దీ వ్యత్యాసంవస్తుంది. అదీకాక 'కూకటుల్ గొలిచిచేసిన సోమిదమ్మ' అన్నట్టు ఉజ్జీ సరిపోతుందా చూడడానికి అనుకోవడం, 'దానితమ్ముడులా వుంటాడు దానిమొగుడ్నిచూస్తే' అని వింతగాచెప్పుకుంటుండడం మామూలు. విజ్ఞానశాస్త్రం చూసి పడికట్టుగా వివాహాలుచెయ్యడం యిప్పట్లో అసంభవం. అందుచేత బాలబాలికలకు ఒండొరులను తెలుసుకుందుకు వతను కల్పించి వారికినచ్చినవారిని పెళ్లిచేసుకోనివ్వడంమంచిది. అంతేకాని యీవయస్సులే న్యాయబద్ధంచేస్తే, యిప్పటివరకూ దంపతులలో కనిపించే వ్యత్యాసాలూ, సంఘర్షణలూ యింకోమెట్టు పైనన్నమాటే.కాని కనపడక తప్పవు.

ప్రశ్న:—బహుభార్యాత్వం నిషేధిస్తే భర్తల రసికత్వం నశిస్తుందా? దీనివల్ల ఉపయోగంయేమిటి?

జవాబు:—ఈనిషేధంవల్ల యింట్లో సవితిపోరులేకుండా పోతుంది. అసలు యిద్దంపెళ్లాలభర్తలు చాలా తక్కువమంది కనిపిస్తారు. పెళ్లిచేసుకుంటే పూ-చీఅయిపోతుంది. జన్మాంతరమువరకూ ఆర్థికమైన యీచిక్కు ఉన్నంతకాలం తప్పని సరిఅనిపిస్తేకాని ఎవరూ యీపనికిసిద్ధంకారు. ఒకతెఉన్నా రెండోదాన్ని కట్టుకోవాలన్న వారినియీచటం నిర్బంధించి వివాహంచేసుకోవడానికి వీలులేదంటే 'పోనీలే' అంటారు. కాని రెండోదానితో సంబంధంమానడు. ఈపై దృష్టి ఉన్నంతకాలం భార్యని ఎలాగా కాల్చుకుతింటూరు ఏదోరకంగా. తమ అభీష్టానికిది అడ్డయిపోతోందనిపిస్తుంది. దీనివల్ల పరిణామం ఏమవుతుందో చెప్పలేం. అనేకమైన కేసులు వింటున్నాం. ఈనిషేధంవల్ల వివాహితస్త్రీకేదో సుఖంవస్తుందనుకోవడం అపోహ. వివాహమెందుకు చేసుకుంటున్నారో, దానితోవచ్చేబాధ్యత లేమిటో తెలుసుకోలేకుండా 'పెళ్లి ఎలాగా తప్పదు. ఎప్పుడైతేనేం' అన్న యీవనమదంలోఉండే తత్వంమరచిపోయి, భార్యయింకొకడితో చాటుగాగాని, బాహాటంగాగాని కలియకూడదనే పురుషప్రవృత్తిలాగే, భర్తయింకొకతెకోసం తంటాలుపడకూడదు, వ్యభిచరించకూడదు అనేప్రవృత్తి స్త్రీకికూడా ఉంటుందని పురుషులు గ్రహిస్తే, భార్యఉండగా రెండోపెళ్లిమాటొక్కటేకాక, పెళ్లాంఉండగా ఇంకొకతెతో వ్యభిచరించే-దుర్గుణంకూడా నశిస్తుంది. మానవప్రవృత్తిలో మార్పురావాలికాని తనచేతితో తయారుచేసిన చట్టాన్ని ఎలామాయచెయ్యాలో పురుషుడికి తెలియదంటారా?

—కె. సూర్యకాంతం.

ప్రశ్న:—నాకు 20 సంవత్సరములు. వివాహముఅయి 6 సంవత్సరములు. నాలుగుసంవత్సరముల పిల్ల. మావాళ్లు ధనముఆశతో 55 సంవత్సరముల ముసలివానికి వివాహముచేసినారు. వారు కదిలితే, మెదిలితే, చెడ్డఅనుమానముతో బాధపెట్టుచున్నారు. ఈబాధనుండి విముక్తిపొందేమార్గము ఏమిటి?

జవాబు:—[దీనికి శ్రీమతి శకుంతలాదేవిగారంపిన జబాబు నిలిపియుంచి-ఇందుకువారుమాపై ఆగ్రహం చెందరు అని ఆశిస్తాము-శ్రీ కాళేశ్వరరావుగారి బిల్లువస్తున్నదిగదా నిదానించండి, అని మాసలహా.
గృ॥ సం॥]

ప్రశ్న:—నాకు 24 సంవత్సరములు. పెండ్లిఅయి 8 సంవత్సరములు. ఇంకాచదువుకోవాలిఅనే ఆశపోలేదు. కాని మావాళ్లు ఇష్టపడరు ఏమిచెయ్యాలి?

జవాబు:—మీవాళ్లు ఎవరు ఇష్టపడినా, ఇష్టపడకపోయినా మీభర్త ఇష్టపడితే చదవండి. పిల్లల ఆటంకమువుంటే పెద్దవాళ్లకో, మిత్రులకో లేక పనిపాటులలో సహాయపడువారికో చదువుకొనే సమయములో అప్పగించండి. ధనమువిషయము మీవాళ్లకు సందేహముంటె ఎవరినైన సహాయము కోరవచ్చు. ఇవికాక ఇంకా ఏమయినకారణములువుంటె వ్రాయండి.

ప్రశ్న:—నాభర్తఅందము, విద్య, బుద్ధి, ఆస్తి, మంచిపలుకుబడికలవారుకాని, వారికుటుంబములోని మిగతావారంతా కలియుగరాక్షసులు. సనాతనులు. వాళ్లఆచారములతో, అలవాటులతో చంపుచున్నారు. ఇంతకీ వాళ్లకివున్న చెడ్డఅలవాటులు, దుర్మార్గపుబుద్ధులు చెప్పటానికి చాలవు. నాభర్తసంసారవిషయాలు కలుగచేసుకోరు. వారికి డబ్బుకుగాని స్వాతంత్ర్యమునకుగాని భంగములేదు. నాకర్మమిట్లుకాలింది. ఏమిచెయ్యమంటారూ?

జవాబు:—గొప్ప చిక్కుప్రశ్న, ఈలాంటి చెప్పలేనిప్రశ్నలతో సలహాచెప్పేవారముకూడ బాధపడుతుంటాము. సామాన్యముగా ఎంతపూర్వాచారపరాయణులయినావారిబిడ్డలను ఆచారములతో ఆధార్టీలతో బాధపెట్టరు. పైమొగవారికి మొదలేవుండదు. ఇతరఅమ్మకన్న బిడ్డమీదనే ఎన్నివిద్యలు ప్రయోగించినా. ఎన్నిసమస్యలతో బాధపడుచున్నా, ఎంతతెలిసినవారైనా, పురుషులు ఎక్కువమంది ఎవరూ స్త్రీలవిషయము ఆలోచించరు. అసలువారికి అవసరముండదు. మీభర్తవిషయము అతనికిస్వేచ్ఛవుంది. సంఘములో అన్నివిధముల గొప్పగా ఎంచబడుచున్నారు కదా? వారినివదలి స్వేచ్ఛగా మీయిష్టమయినచోటుకు వెళ్లటము మంచిదికాదు. వెళ్లిన ఈసంఘములో అన్నివిధముల తగినభర్తనువిడిచివచ్చిన మీకు క్షేమంవుండదు. వున్నా ఎక్కువగా మీమనస్సుప్రేమతో వారికోసమే బాధపడుతుంది. అప్పుడు ఇంకా పెద్దసమస్య ఏర్పడుతుంది. వీలుఅయినంతవరకు మీభర్తకే నచ్చచెప్పి మీకష్టసుఖములు ఆలోచించునట్లు చూచి సరియైనమార్గమున సంసారము సాగించుటమంచిది.

—సూర్యదేవర శకుంతలాదేవి.

(విలేఖరుల అభిప్రాయాలకు పత్రికాసంపాదకులు బాధ్యులుకారు. గృ॥ సం॥)

# ఖాదీ ఉత్పత్తి

శ్రీ టి. వి. రాఘవరావుగారు
మద్రాసు ప్రభుత్వంలో అసిస్టెంటు డెవలప్ మెంటు కమిషనర్.

(గతసంచిక తరువాయి)

ఇందుకు వుదాహరణకు ఈ పనినడచిన ఒకేసంవత్సరాన్ని తీసుకొని, ఈ మూడుమార్గాలలో వస్త్రపరిశ్రమ, ఎట్లానడచిందో చూద్దాం. ఇందుకు గత యుద్ధప్రారంభంలో మామూలు పరిస్థితిలోవున్న ౧౯౩౯ వ సంవత్సరం తీసుకొని ఈ మూడూ చూద్దాం.

౧౯౩౯-౪౦ సంవత్సరంలో మనదేశంలో బొంబాయి, అహమ్మదాబాదు, కాన్పూరు, మద్రాసు, కోయంబత్తూరు, మధురపట్టణాలలో బట్టలమిల్లులూ, నూలుమిల్లులూకలసి, షుమారు ౩౫౫ వున్నాయి. అందులో షుమారు ఒకలక్ష అరవైయేడువేల మగ్గాలున్నాయి. ౧౦౪ లక్షల మూడువేల కదుళ్లున్నాయి. నాలుగులక్షల యాభైవేలమంది మగవాళ్లు, లక్షా యాభైవేలమంది స్త్రీలు, పిల్లలూ, యీమిల్లుల్లో పనిచేసి సుమారు ౪ వందలా ఒకకోటీ చదరపు గజాలగుడ్డ తయారుచేశారు. అంటే ౩౫౫ మిల్లులుకలసి ఆరులక్షల మంది కూలీలకు మాత్రం పని కల్పించినాయన్నమాట.

అదేసంవత్సరంలో, అన్నిరాష్ట్రాలలోకలసి సుమారు ౪ వందల ఒకకోటీ చదరపుగజాలగుడ్డ తయారు చేశారు. అంటే ౩౫౫ మిల్లులుకలసి ఆరులక్షలమంది కూలీలకుమాత్రం పనికల్పించినాయన్నమాట. ౧౦ లక్షల చేనేత మగ్గాలమీద, ౧౫౦ కోట్ల చదరపుగజాలగుడ్డ తయారుచేశారు. అంటే, ౧౦ లక్షల నేతగాండ్ర కుటుంబాలకు పనిగలిగిందన్నమాట. ఈ నేతగాండ్రకుటుంబాలన్నీ చాలామటుకు గ్రామాలలోనేవున్నాయ్.

ఇక అదే సంవత్సరంలో చరఖా సంఘంవారు గ్రామాలలో చేసిన పనిచూద్దాం. ౧౩,౪౫౧ గ్రామాలలో షుమారు ౨ లక్షలా ౭౫ వేలమంది గ్రామవాసులు నూలువడికి, ౨౦ లక్షల రూపాయల వడుకుకూలీ సంపాదించారు. ఇందులో ౨౦ వేలమంది హరిజనులు, ౫౭ వేలమంది మహమ్మదీయులు-కూడా వున్నారు. ౨౦ వేల మగ్గాల పైచిలుకు పనిచేసి, షుమారు ౧ కోటీ, ౫౦ లక్షల గజాల ఖద్దరుగుడ్డ వుత్పత్తిచేశారు. ఈ నేతగాండ్రకున్నూ-డా ౧౫ లక్షలరూపాయలు మజూరీక్రింద ముట్టింది. ఇప్పటి లెక్కప్రకారమైతే ఇది ౧౫ లక్ష లన్నమాట.

ఇక లెక్కకురాకుండా, ప్రయివేటు వర్తకులూ, ఆనాటినుంచీ గ్రామాలలో తమ వస్త్రాలను తామే వుత్పత్తిచేసుకుంటున్న వేలకొద్ది కుటుంబాలవారు కనీసం యింతకు మూడు నాలుగురెట్లమంది పనిచేసి, తమ బట్టను తాము వుత్పత్తిచేసుకొని వుంటారని అనేకజిల్లాల అనుభవాన్నిపట్టి తెలుస్తుంది.

కాబట్టి గ్రామగ్రామానా ఒక నిర్ణీతపద్ధతిలో ఈ రాట్నపరిశ్రమను పునరుద్ధరణ అయితేగాని యిప్పుడు మనదేశంలో వున్న ఆర్థిక అసమానత్వం అంతమొందదు. వృత్తులలోని హెచ్చు తగ్గులూ, వ్యక్తిసంపాదనలోని అంతులేని అంతరాలు అప్పుడుగాని అంతమొందవు. ఆనాడుగాని దేశంలోని ప్రతి మానవునికీ జీవితావసరాలలో ముఖ్యమయిన వస్త్రోత్పత్తిలో ఒకరిపైనొకరు అన్యోన్యప్రేమ మార్గాన, మన సాంఘికవ్యవస్థను పునర్నిర్మాణం చేసుకోరు. తర్వాతగాని ప్రజాజీవితంలో శాంతి యేర్పడి, పోటీ విధానం అంతమొంది, జీవితావసరాలవస్తునిర్మాణంలో, అందరంకలసి పనిచేయాలిరాఅనే పరిజ్ఞానంకలుగదు,

మహాత్ముని సూచన ననుసరించి అఖిల భారత చరఖాసంఘ కార్యదర్శి శ్రీ కృష్ణదాసు జాజూసహాయంతో మన మద్రాసు ప్రభుత్వం మనరాష్ట్రంలోని ఏడు ప్రాంతాలలో ౭ కేంద్రాలను ప్రత్యేకముగా ఎన్నుకొని సుమారు ౨౫౧ గ్రామాలలో రాట్నం పరిశ్రమను వికేంద్రీకరణ పద్ధతిలో ఎక్కడి కక్కడ ఖద్దరు వుత్పత్తిచేసి, రాష్ట్రంలోని గ్రామాలన్నిటికీ దారిచూపుతోంది.

అందులో కర్నూలుజిల్లాలో ఎన్నుకోబడ్డ, ఎర్రగొండపాలెం అనే కేంద్రపరిసరగ్రామాలన్నీ ఆనాటి నుంచీ, వస్త్రపరిశ్రమకు సంబంధించిన పనులన్నీ, ఏ గ్రామమున కాగ్రామం స్వయంసమృద్ధిగా మారకపు పదతిననుసరించి, వస్త్రోత్పత్తిని చేసుకుంటూ వున్నాయి. ఈ మారకపు పద్ధతిపై—ఎక్ఛేంజి-ఆధారపడి, అన్యోన్యఆశ్రయానికి తావిచ్చుకుంటూ, వడుకువారూ నేతవారూ ఒకరిపై ఒకరు ఆధారపడి పని చేసుకుంటూవున్న వస్త్రోత్పత్తిని గత ఈ ౧౫౦ సంవత్సరాల బ్రిటిషుపరిపాలన ఎంతమాత్రం మార్పు చేయలేకపోయింది. దీనికి ముఖ్యకారణం ఆ ప్రాంతంలో ఆనాటినుంచీ వస్తుమార్పిడి విధానాన్ననుసరించి, అమలులోవుంటున్న ఆర్థికవ్యవస్థానిర్మాణమే.

భారతజాతీయైక్యతకు, జాతీయార్థిక స్వాతంత్రసమానత్వాలకూ సత్యాఅహింసలకూ, రాట్నమూ, ఖాదీ బాహ్యచిహ్నమని ఎలుగెత్తి గత ముప్పదిసంవత్సరాలనుంచీ మనకు చెపుతున్నాడు.

మహాత్ముడు నడిపిన అహింసామార్గాన యీనాడు రాజకీయస్వాతంత్ర్యం సంపాదించాం. ఈ అహింసామార్గంలో మనజాతిని నడిపించటంలో ఆరితేరిన ఆ మహాత్ముడే, మన ఆర్థికస్వాతంత్ర్యానికి, గ్రామసౌభాగ్యానికీకూడా యిదేమార్గమంటున్నాడు. దానికి బాహ్యచిహ్నమే రాట్నపరిశ్రమఅని నిరంతరం చెపుతూ తాను ఆచరిస్తున్నాడు. భారతజాతికి ఆర్థికస్వాతంత్ర్య సమానత్వాలకు రాట్నమే ప్రథమసోపానమంటున్నాడు. జాతీయపునర్నిర్మాణ కార్యక్రమానికి మూలాధారమంటున్నాడు.

కాబట్టి మన ౭ లక్షల గ్రామాలలోవున్న ౭ కోట్ల కుటుంబాలవారు జీవితావసరాలలో ముఖ్యమైన అన్నవస్త్రాలను, తమగ్రామాలలోనే వుత్పత్తి చేసుకొని, గ్రామసౌభాగ్యాన్ని పెంపొందించుకుందామని కక్షబూని ఎక్కడికక్కడ ౭ కోట్ల గృహములలో ౭ కోట్ల రాట్నాలనూపెట్టి తమ గ్రామాలలోనే కావలసిన ప్రత్తిని పండించుకుంటూ, తమతీరిక కాలంలో రోజూకు యింట్లోవారంతా మూడుఘంటలు పనిచేసి, సగటున ఒక చిలప దారంతీస్తే, సంవత్సరం మొత్తంపైన దేశంలో ౯౮౦ కోట్ల చదరపు గజాలగుడ్డ తయారవుతుంది. దేశంలోవున్న ౫౦ లక్షల నేతగాండ్రకుటుంబాలనూ తిరిగి పోషించటానికి వీలవుతుంది. మనిషికి పెద్దవారికి ౨౦ చదరపు గజాలూ, పిల్లలకు ౧౦ చదరపు గజాలూ చొప్పున సగటున గుడ్డపంపకం చేయటానికి వీలవుతుంది.

ఈ నిర్ణీతపద్ధతిలో మన గ్రామవాసులంతా దృఢసంకల్పంతో పట్టుదలతో పనిచేస్తే మన ౭ లక్షల గ్రామాలలో వున్న ౭ కోట్ల కుటుంబాల వారికీ కావలసిన ౫౬౦ కోట్ల చదరపు గజాలగుడ్డనూ స్వయం సమృద్ధి చేసుకొనడమేకాకుండా, మన రెండువేల యేడువందల పట్టణాలలో నివసిస్తున్న కోటి కుటుంబాల వారికికూడా పైలెక్కప్రకారమే ౮౦ కోట్ల చదరపుగజాలగుడ్డ సరఫరా చేసే స్థితిలోవుండి, మన గ్రామ సౌభాగ్యాన్ని, తద్వారా మనజాతీయ సౌభాగ్యాన్ని యెన్నోరెట్లు అభివృద్ధిచేసుకొని, మన ఆర్థికవ్యవస్థ పునర్నిర్మాణం చేసుకోవడానికి వీలవుతుంది.

ఇదే మహాత్ముడు సత్యాఅహింసలకు బాహ్యచిహ్నములని రాట్నచక్రముగుండా, గత ముప్పయి సంవత్సరాలనుండి కలగంటున్న భారతజాతీయ ఆర్థికస్వాతంత్ర సమానత్వసౌధం. అందులో నివసించే స్వాతంత్రభారతజాతి తద్వారా అనుభవించేదే గ్రామసౌభాగ్యం.

జైహింద్—ఆలిండియా రేడియోవారి అనుమతిని.



## స్వదేశ రక్షణకు కాశ్మీర్ స్త్రీల ముందడుగు
## ఘోషాస్త్రీలుకూడా సైన్యంలో ప్రవేశిస్తున్నారట

కాశ్మీర్ జాతీయసైన్యంలో ఒకభాగంగా మహిళాదళం ఏర్పడినట్లు తెలుస్తున్నది. ఈ దళం ఒక వారంరోజుల క్రిందట స్థాపించబడినది. ఇప్పటికి దీనిలో 150 మంది స్త్రీలు చేరారు. వీరిలో విద్యార్థినులు, ఉపాధ్యాయురాండ్రు, జాతీయమహాసభ ప్రచారకుల భార్యలు, కాశ్మీర్ లోని కార్మికురాండ్రు మున్నగువారున్నారు. ఈ దళంలో చేరినవారిలో హిందువులు, ముస్లిములుకూడావున్నారు. వీరిలో 25 మంది ముస్లిములు ఘోషా స్త్రీలు. అయినా వీరు ఈ దళంలో చేరడంతోనే బురఖాలు తీసివేశారు.

ఈ మహిళాదళంలో చేరినవారికి తుపాకులు ఉపయోగించడంతోపాటు ఆధునిక యుద్ధపద్ధతులలో, ఆత్మరక్షణ పద్ధతులలో సైనికశిక్షణనిస్తున్నారు.

శ్రీనగర్ లో జనానాపార్కులో సైనికశిక్షణపొందుతున్న మహిళలనుచూచిన యునైటెడ్ ప్రెస్ ఆఫ్ ఇండియా ప్రత్యేక విలేఖరి ఈ క్రింది సంగతులు తెలుపుతున్నాడు.

"నే నక్కడికి వెళ్లేసరికి ఒక్కొక్కదళానికి 25 మంది చొప్పున రెండుదళాలు అక్కడ సైనిక విన్యాసాలు జరుపుతున్నవి. మహిళలు తుపాకులుధరించి అసలు సైనికులవలె గంభీరంగా విన్యాసాలు చేస్తున్నారు. దళంఏర్పడి వారంరోజులు పూర్తికానిదే ఇంతలో మహిళలు అంత చక్కగా ఎలాశిక్షణ పొందగలిగారన్నవిషయం చూపరులకు తప్పక ఆశ్చర్యంకలిగిస్తుంది.

స్త్రీలు తుపాకుల ప్రయోగం సందర్భంలో అసమాన చాతుర్యాన్ని కనపరచడం తనకెంతో ఆశ్చర్యం కలిగించినట్లు వారిని తరిఫీదు చేస్తున్నవాడు సూచించాడు. గురిపెట్టి తుపాకులుకాల్చడం నేర్చుకోడానికి మొదటి మహిళాదళం సిద్ధంగావుందనీ, కొద్దివారాలలోపునే వారికి సైనికశిక్షణ పూర్తిఔతుందనీ అతడన్నాడు.

ఈ మహిళాదళానికి సైనికదుస్తులు ఇంకాతయారుకాలేదు. వారిలో 16 సంవత్సరాలు మొదలు 35 సంవత్సరాలవయసుగల వారున్నారు. వారందరు రంగురంగులచీరెలుకట్టుకొని శిక్షణపొందడం చాలా తమాషాగావుంది.

కాశ్మీర్ కార్మికురాండ్రే ఈ మహిళాదళంలో వాలంటీర్లను చేర్చడానికి కృషిచేస్తున్నారు. పద్నాలుగు సంవత్సరాలబాలిక ఈ దళంలో చేరడానికి దరఖాస్తుపంపింది. కాని, ఆమెకు వయసుచాలదన్న కారణంమీద ఆ దరఖాస్తును నిరాకరించారు. కాని, ఆమె అక్కడనుంచి కదలదలచుకోలేదు. ఎలాగైనా తనను రిక్రూట్ చేసి, తనకు సైనికశిక్షణ నివ్వవలసిందని ఆమె పట్టుపట్టింది. తుదకు అధికారులు ఆమెను వాలంటీర్ గా చేర్చుకున్నారు."

"ఆంధ్రప్రభ"

# స్త్రీలకు సంబంధించిన క్రొత్త చట్టములు, బిల్లులు

●

మద్రాసు రాష్ట్రశాసనసభలో ఈక్రిందిబిల్లులు ప్యాసైనవి.

## పడుపువృత్తి నిరోధకశాసనం.

దీనివివరం గతసంచికలో తెల్పినాము. సెలెక్టుకమిటీవారి రిపోర్టుననుసరించి బిల్లు ప్రవేశపెట్టబడి 26-11-47 న మద్రాసుశాసనసభచే తీర్మానింపబడినది. సెలెక్టుకమిటీవారు-జైలుశిక్షానంతరము క్రమశిక్షణ గృహమున నుంచబడవలసిన యువతివయస్సు 35 సం॥ ల నుండి 30 సం॥ లకు దించినారు. ఈబిల్లు చర్చ సమయంలో-పడుపువృత్తిచేసిన స్త్రీనే ఏల శిక్షించవలెను, అందుకు పాలుపడ్డపురుషునికూడా శిక్షింపరాదా-అని మాజీవంగోలు జిల్లాబోర్డు అధ్యక్షులు, నర్సారావుపేట ఎం. ఎల్. ఏ. శ్రీ బ్రహ్మానందరెడ్డిగారన్నారు. మంత్రిగారు ఇదొకచమత్కారమైన హంశమేగాని ఈబిల్లుకు సంబంధించదు అన్నారు,

## దేవదాసీ నిషేధపుబిల్లు.

దీని వివరమున్నూ గతసంచికలో ఇచ్చియున్నాము. సెలెక్టు కమిటీవారి రిపోర్టుననుసరించి ఇది తిరిగి ఈ 26-11-47 న మద్రాసు శాసనసభలో ప్రవేశపెట్టబడి అంగీకరింపబడినది. ప్రవేశపెట్టుచు-సుబ్బరాయన్ మంత్రి-ఈ 20 సం॥లుగా ఈబిల్లుచేబట్టినవారికల్ల పదవీచ్యుతికలైనని దీని విషాదచరిత్రము నేకరవుపెట్టి ప్రస్తుతము దీనిని ప్రవేశపెట్టినవారికి ఆగతి పట్టకుండుగాక యని కోరుచున్నాను అన్నారు. (ఈ చరిత్ర వివరంగా గతసంచికలో ఇచ్చినాము. ఈనెలరోజులలో సుబ్బరాయన్‌గారి పోలీసుశాఖప్రధానిగైకొనుట, కొంత గందరగోళమైనపిదప తిరిగిలభించుటచూడ దీనిశాఖ యూరకపోలేదని తోచును.) మరియు నీ చర్చా సందర్భమున - పెద్దయింటిబిడ్డలే - భరతనాట్యమని, కళయని రంగమెక్కి నర్తించుచున్నారేయని - నటేశన్‌గారసహ్యముగా విమర్శించారు. కళాప్రశంసగా - "తమిళులు కళాపోషకులు-విజ్ఞానధనులు" అని సుబ్బరాయన్ తమ్ముతాము పొగడుకోగా శ్రీ సలాంగారు - జిన్నాబోధల ననుసరించి తామొక ప్రత్యేక సంస్కృతిగలవారమంటున్నమాట తత్కాలమునకు మరచిపోయి, ఆంధ్రుల కూచిపూడి భరతనాట్యప్రశంస గావించి ఆంధ్రాభిమానము చూపినారు.

## స్త్రీలకు భూవసతిపై హక్కు

'భర్తఆస్తి భర్తఅనంతరము వ్రాసియివ్వకపోయినా భార్యకు హక్కుఉన్నది, అని కేంద్రశాసనసభ 1937 లో చట్టంచేసింది. వారు భూవసతికి కూడా ఈ అక్టు చెందునని పొరబడ్డారు. 'భూవసతి' రాష్ట్ర ప్రభుత్వములకుచెందినది కాన చెందదని ఫెడరల్ కోర్టుతీర్పు. దానిపై పలురాష్ట్ర ప్రభుత్వములు భూవసతికి నీ చట్టముచెల్లునని ప్రత్యేకచట్టములు చేసినవి. నేడు (27-11-47)లో మద్రాసుప్రభుత్వమును అట్టి చట్టము గావించినది. అయితే స్త్రీ సభ్యురాండ్రందరున్నూ వైద్యనాథయ్యర్, కాశీశ్వరరావు ఇత్యాది పురుష సభ్యులు కొందరున్నూ, ఈ చట్టము అసలుచట్టమైన 1937 నాటనుండికూడా అమలు జరుగవలెనంటారు. ఈలోపల అన్యాక్రాంతములైన భూవసతులవిషయంలో అమితంగా వ్యవహారములు జరుగవలసివుండును. అది స్త్రీలకే వ్యవప్రయాసలకు కారణభూతమని మిగతవారంటారు.

## కేంద్రశాసన సభలో ప్రవేశ పెట్టబడిన బిల్లులు

## బలవంతముగా మతాంతరులైన హిందూస్త్రీల సంరక్షణబిల్లు.

ఇటీవల మతకలహాల్లో బలవంతంగా మతాంతరులైన హిందూస్త్రీలకు 'లా' ఏవిధంగాను ప్రతిబంధకం కారాదని, వారిని మతాంతరులుగా 'లా' అంగీకరించరాదని—హెచ్. వి. పటస్కార్‌గారొక బిల్లును కేంద్రసభలో తెచ్చినారు.

## పునస్సంధానవయో నిర్ణయపుబిల్లు.

1928 లో ఈ విషయమై విచారణసాగించిన కమిటీవారిరిపోర్టు ననుసరించి శ్రీపండిత ఠాకూర్ దాస్ భార్గవాగారిబిల్లును కేంద్రశాసనసభలో తెచ్చినారు. ఇందలి ముఖ్యాంశాలు (1) గాంధర్వవివాహముల స్త్రీకి 18 సంIIలు, (2) వివాహితులలో యువతికి 15 సంIIలు (3) స్త్రీని బలవంతమొనర్చుట అనేనేరం విషయంలో "భర్త"ను తొలిగించి—అతని తప్పిదానికి—'వివాహితుని అపచారము' అని క్రొత్తపేరు పెట్టవలయును, ఆ భార్యవయస్సు 12 సంII లకు లోపా, పైనా అనేదానినిబట్టి నేరము యొక్క హెచ్చుతగ్గులు—శిక్షా కాలపరిమితులు నిర్ణయింపవలెను. (4) 18 సంIIల లోపు యువతిని బలవంతమొనర్చుట బాలికాగమన దోషముగా నేరమని నిర్ణయించవలెను. (ఈయనదే వివాహవయో నిర్ణయము—14 సంIIలనుండి 15 సంIIల హెచ్చింపబిల్లు తెత్తురట) ఈ బిల్లు ప్రజాభిప్రాయముకొరకు ప్రకటింప తీర్మానింపబడినది.

## హిందూ వర్ణాంతర వివాహపుబిల్లు.

శ్రీ శాక్సనాగారు హిందూవర్ణాంతర వివాహములు-అగ్నిసాక్షికములు, చెల్లునని యొకబిల్లు ప్రవేశపెట్టినారు.

---

# మానవకోటికి
# శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారి
# అమూల్యసందేశము

జీవితమనునది అతిక్లిష్టమైనసమస్య. దాని నర్థముచేసికొనుటకు అతిశాంతమైన వివేచన కావలయును. జీవితము ఓకేమాదిరిది కాకపోవుటచేతనూ, జీవితములోని అన్ని భాగములు పరస్పర సంబంధముగల్గిన వగుటచేతనూ, మనముదాని నేయొక్క కోణమునుండియు నాలోచించరాదు. ఆర్థికవాదిగాగాని సాంఘిక వాదిగాగాని, సామ్యవాదిగాగాని, యేఒక విధముగా జీవితసమస్య నెదుర్కొన్ననూ, అది అసంపూర్ణమే యగును.



ఇంతక్లిష్టమైన జీవితసమస్యను చాల సూక్ష్మముగా గ్రహించవలెను. అస్తమానసూర్యుని చూచుచు, నిన్నటి సూర్యాస్తమయము బాగున్నదా? నేటి సూర్యాస్తమయము బాగున్నదా? అనుకొన్నచో ఆకాశపు మేలిరంగుయొక్క అందములు తెలియవు.

కాన ఈ సమస్యనుగూర్చి ఆలోచించునప్పుడు ఒక సిద్ధాన్తము ననుసరించిగాని వ్యవస్థననుసరించిగాని ఆలోచింపరాదు. నీయెదుటనున్న కల్లోలమునకును నీకునుగల సంబంధములో గుర్తించవలయును. ఈ కల్లోలమునకు కొద్దిమంది నాయకులు కారకులుగారు. ఆనాయకులకు దోహదమిచ్చిన నీవు కారకురాలవు. అందుచేత నీకల్లోలమునకుగూడ నీవు కారకురాలవు. మొట్టమొదట నిన్ను నీవు తెలుసుకొని తద్ద్వారా పైప్రపంచములో శాంతిని నెలకొల్పుటకు ప్రయత్నించవలెను.

నీ బాధ్యతను నీవుగుర్తించవు కనుక, సూత్రములపైననూ వ్యవస్థలపైననూ బాధ్యతను మోపుదువు. మతము పేరిట కొన్ని కట్టుబాట్లు వ్యక్తిగతమైన బాధ్యతను తొలగించినవి. నీకు చదువుచెప్పినప్పుడు నిన్ను ప్రత్యేకమైన పనికి అనుగుణముగా తయారుచేసినారు. అందుచేత నీవు సమగ్రమైన జీవితమును అన్వయించుకొనకున్నావు. ఈ లోట్లను సరిచేయుటకై నిన్ను నీవు దిద్దుకొనుటతో మన మారంభించవలయును. కృష్ణమూర్తిగారి వాక్యములు పురుషులకెంత వర్తించునో స్త్రీలకుగూడ నంత వర్తించును. అందుచే గృహిణీమణులెల్లరు, శ్రీవారి సందేశమును పాటించి లోకకల్యాణమునకు తోడ్పడెదరుగాక.

—సూరంపూడి భాస్కరరావు.

# ఆలిండియా రేడియో — మదరాసు

## మహిళామండలి కార్యక్రమాలు - డిశంబరు 16-వ తేదీ నుంచి జనవరి 15-వ తేదీ వరకు

### డిశంబరు-1947

16 వ తేదీ మంగళవారము: స్త్రీ సౌభాగ్య సోపానాలు. వీటిమాట ఆలోచించారా?-దేవదాసీల వృత్తి నివారణ చట్టము సంభాషణ, ఆహార పదార్థాలు-ఆకుకూరలు కరివేప, పుదీనా, కొత్తిమీర.

18 వ తే॥ గురువారము: వివిధదేశాల వింత ఆచారాలు - రష్యనులు ఆంధ్ర వీరవనితలు - మహాలక్ష్మమ్మ.

20 వ తే॥ శనివారము: మా వదిన కాపరం రూపకము, మహిళాలోకము.

23 వ తే॥ మంగళవారము: వీటి మాట ఆలోచించారా? - స్త్రీలు-సంఘసేవ; -ఆహారపదార్థాలు-కాయకూరలు-ప్రసంగము కాకర, దొండ, దోస,

25 వ తే॥ గురువారము: మీరు చదివారా డిక్కెన్స్ రచించిన కథానిక "క్రిష్టమస్ కార్డ్.

27 వ తే॥ శనివారము: 'స్త్రీ పురుషుల నిర్వచనాలు-జాన్ రస్కిన్ అభిప్రాయాలు ప్రసంగము

30 వ తే॥ మంగళవారం విడాకుల చట్టము-సంభాషణ.

### జనవరి-1948

1వ తే॥ గురువారం: స్త్రీ తెలుసుకోవలసిన విజ్ఞానము భూగోళ శాస్త్రము-ప్రసంగము, సంఘ మర్యాద-నిర్ణీతకాలాన్ని పాలించడము.

6వ తే॥ మంగళవారం: పూలనావలో - యుగళగీతము. స్త్రీలు చెయ్యదగిన ఉద్యోగాలు-ఉపాధ్యాయిని ప్రసంగము.

8 వ తేది గురువారము: స్త్రీలు తెలుసుకోవలసిన విజ్ఞానము గణితశాస్త్రము - ప్రసంగము, స్త్రీలకు ప్రత్యేక కళాశాలలు సంభాషణ

10 వ తే॥ శనివారము: వందేమాతరం-బృందగానము, ఎంకితో తీర్థానికి-రూపకము, దుంప కూరలు నీరుల్లి-ప్రసంగము.

13 వ తే॥ మంగళవారము: స్త్రీ-పురుషుల నిర్వచనాలు-వేమన అభిప్రాయాలు - ప్రసంగము.

15 వ తే॥ గురువారము: స్త్రీలు తెలుసుకోవలసిన విజ్ఞానము జీవశాస్త్రము - ప్రసంగము బొమ్మలనోము రూపకము. మంగళము.

---

## "మా భూమి": ఆదర్శ ప్రచార ప్రదర్శనము.

'స్వరాజ్యం వచ్చింది-స్వతంత్రులమయ్యాము'. అని అనుకుంటూన్న యీ రోజుల్లో నైజాం ప్రాంతాలలో జరిగే ఘోరకృత్యాలు భరింపరానివి. తలుచుకుంటే గుండె తరుక్కుపోతుంది.

అట్టి ఘోరకృత్యాలసంఘటనలు, హింసా ప్రభుత్వ అహంకారము, అందుకు మద్దత్తుచేస్తూ తాళం వేసే అధికారుల ప్రవర్తనలు. అందువల్ల సామాన్యప్రజ, రైతాంగమునకు కలిగే కష్టనష్టాలు, అందుపైన కలిగే సంచలనము-సంఘం యేర్పాట్లు- దాని-నిజస్వరూపం-పర్యవసాన ఫలితం వున్నదున్నట్టు, జరిగినది జరిగినట్టు ఆంధ్రప్రజా నాట్యమండలివారు 'మాభూమి' ప్రదర్శనంద్వారా చక్కని ప్రచారంచేస్తూ వారివిధిని నెరవేర్చుకుంటూ ధన్యత పొందుచున్నారు.

కథావస్తువు:-ప్రస్తుత ఘోరకృత్యాల సంఘటనలు, అవినీతి, అధికారుల కుళ్లును బయట పెట్టు ఘట్టాలు కాలానుగుణమైన సమయోచితమైన ప్రచారమే యీప్రదర్శన ఆశయము.

నటీనట వర్గము:—ఏ వ్యక్తికావ్యక్తి వారివారి పాత్రలను కడుసమర్థతతో అనుభవించి, పోషించారు.

ప్రదర్శనకట్టుబాట్లు, ఆయాసీన్సుల తగుయేర్పాట్లు చక్కగావున్నాయి.

ప్రదర్శనమును చూస్తూన్నంతసేపూ సభ్యులు మైమరచివుండడం ఆశ్చర్యంగాదు. జీవితపర్యంతమూ ఆ ఆదర్శ ప్రచార ప్రదర్శనసంఘటనలు కండ్లకుకట్టినట్టు, హృదయాలలో నిండివుంటున్నాయి.

ఇటుకళకు, అటుప్రచారానికి సేవచేస్తున్న ప్రజానాట్యమండలివారు ప్రశంసనీయులు.

# సంపాదకీయములు

## స్త్రీలు—సైనికశిక్షణ

స్వాతంత్ర్యసిద్ధితో దేశసంరక్షణార్థమై ప్రజాసామాన్యమునకు సైనికశిక్షణ నొసంగవలెననే భావము వృద్ధిపొందుతూఉన్నది శ్రీ డా. భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు కేంద్రశాసనసభలో జాతీయ సైన్యము నేర్పరుపుడని తెచ్చిన తీర్మానము దాని చిహ్నమే. సైనికమంత్రియు తీర్మానసూత్రము నంగీకరించి-ప్రాంతీయసైన్యమా, జాతీయసైన్యమా అని యోచనలో నున్నదనిరి. మద్రాసురాష్ట్రమున్నూ హైదరాబాదు వ్యవహారములు మున్నగువాని ప్రోత్సాహమున నేషనల్ గార్డ్సు, నేర్పరుపదలచినది. అయితే ఈ సైనికశిక్షణ ఒక్క పురుషులకేగాక స్త్రీలకును ఇవ్వవలయునని మా వాదము. ప్రజలలో సగము జనాభా అబలలు, పరాధీనలు, సంరక్షణీయులు - అయితే ఆ జాతికి ఒకపక్షం చప్పుపడినదన్నమాటే. పురాతన కాలంలో కైక దశరథుని రథంనడిపింది, సీత శివధనుస్సు నెడమచేతితో ఎత్తి అవతలఉంచినది. సుభద్రార్జునుల సరసగోష్ఠిలో పద్మవ్యూహం చొచ్చడం ఒకహంశమైనది. చారిత్రక స్త్రీలైన రుద్రమదేవి, నాగమాంబా, ఝాన్సీ, అహల్యాబాయి ఇత్యాదులు రణరంగ విహారం చేసినవారున్నారు. నిన్నమొన్న బోసుసైన్యంలో కల్నల లక్ష్మి-తాను ఉపయోగింపజాలని ఆయుధంలేదనిచెప్పి తన్నుపట్టుకున్న ఆంగ్లేయ సేనానిని హడలు కొట్టియున్నది. నేడు సైనికశిక్షణ దేహబలంతోపాటు బుద్ధిబలమున్నూ అవసరమైనది యుద్ధనిర్వహణలో-బాహాబాహి పోరాడడంకన్నా- దాని నుపాంగాలుగా జరిగే అనేక కార్యకలాపాలలో స్త్రీలు, స్త్రీలే-చేయగలపను లనేకమున్నవి. కాబట్టి స్త్రీలకున్నూ సైనికశిక్షణ అవసరము. ఆసంగతిని పై డాక్టరు పట్టాభిగారి తీర్మానసందర్భంలో శ్రీమతి దుర్గాబాయి జోషిగారు, ప్రస్థావించగా—నేషనల్ కేడెట్ కోర్ కమిటీవారి సిఫారసు ననుసరించి తర్ఫీదు పొందబోయేవారిలో స్త్రీలుకూడా ఉన్నారని-సైనికమంత్రికూడా చెప్పియున్నారు. ఇందుకు మేమెంతైనా హర్షిస్తున్నాము. ఆంధ్రనారీమణులు ఈఅవకాశమును పూర్తిగా వినియోగించుకోవలెనని కోరుచున్నాము.

## మద్రాసు ప్రభుత్వానికి ఆస్థానకవులు.

మద్రాసు ప్రభుత్వంవారు ప్రాంతీయభాషలకు ప్రోత్సాహమిచ్చేవిధానంలో ఆస్థానకవీంద్రులని కొందరిని, తెలుగు, తమిళం, కన్నడం, మళయాళం, సంస్కృతభాషలకు భాషకొక్కరినిగా, ఎర్పరుపవలయునని నిర్ణయించుకున్నారు. ఈ ఆస్థానకవీంద్రపదవి పురుషులకే ప్రత్యేకింపబడినదో స్త్రీలుకూడ నియమింప నర్హులో తెలియదు. పురాతనకాలంలో మొల్ల, కృష్ణాజమ్మ, రంగాజమ్మ, ముద్దుపళనీత్యాదులు నారీమణులు గొప్పకవయిత్రులై వర్ధిల్లిరి. నేటికాలమున కాంచనపల్లి కనకమ్మగారు గొప్పకవయిత్రి అని ప్రఖ్యాతివహించిరి. ఇటీవల శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారి కవితావిశేషమును కవిత్వతత్త్వవిచారగ్రంథకర్తలు శ్రీకట్టమంచివారే ప్రశంసించినారు. కావున స్త్రీలనుకూడా ఈ పదవికి నియమించుట కభ్యంతరము లేదని ప్రభుత్వమువారు ప్రకటించుటయేగాక-ప్రథమమున నాస్థానము స్త్రీకే యొసంగుదురు గాక యనికూడ గోరుచున్నాము.

## కంట్రోలు : రేషను

క్రమముగా నొక్కొక్క పదార్థముపై కంట్రోలును రేషనింగునూ తొలగిపోతున్నవి. పప్పులు, చక్కెరలపై ఇప్పటికే తొలగినవి. బియ్యమునకు త్వరలో తొలగవచ్చు. కట్టెలకున్నూ వచ్చేసంవత్సరాంతంలో తొలగిపోవునంటున్నారు. కంట్రోలు రేషనులు తొలగినమాత్రాన వస్తువులు అందరికి పుష్కలంగా చౌకగా దొరుకును అని భ్రమపడరాదు. ముందుధరలు విస్తారంగా పెరిగేమాట నిశ్చయం. అయితేవానిని తగ్గనిచ్చే అవకాశం గృహస్థులది-అంటే గృహలక్ష్ములది. ధరలుతగ్గడానికి రెండుఅవసరం : సరుకువిస్తారం, డిమాండు తగ్గడం. వ్యవసాయం అభివృద్ధిఅయితేనేగాని ఆహారధాన్యాదులు సరుకువృద్ధిగాదు. దానికి కొంతకాలం పట్టునుగాని వెంటనేఅయ్యేదికాదు—ఇకడిమాండున్నది; కంట్రోలు రేషనులు తొలగినవికదాఅని-పురుషులను సరుకు విస్తారంగా కొనితెండిఅంటే-డిమాండు హెచ్చైధరలు క్రిందికిదిగవు. పైగాధనవంతులకే ఇవి సులభసాధ్యమవుతవి. మధ్యతరగతివారికి కుటుంబవ్యయం విస్తారమై ఋణగ్రస్తత ఏర్పడుతుంది. సామాన్యతరగతివారికి ఇవి దుర్లభమవుతాయి. కాబట్టి గృహలక్ష్ములుచూపే నిగ్రహమే నేడీసమస్యను చక్కగా పరిష్కరించడానికి తోడ్పడుతుంది, రేషనుకంట్రోళ్లుతొలగినందువల్ల కలగవలసినమంచిఫలితం చేకూరుతుంది.

## అపహరింపబడిన అభాగినులు

మతకలహములమూలమున నిదియొకసమస్య బయలుదేరింది. ఆ కలహములయుద్రేకం చల్లారుతుండగా ఈ సమస్యాపరిష్కారాని కుభయపక్షాలున్నూ ఆత్రపడుతున్నాయి. ఆ ఆత్రంఫలితమే-ఈ నెల 6 వ తేదీన ఉభయడొమినియనులకుచెందిన మహిళామణుల సమావేశము. ఆ సభలో ఉభయరాజ్యముల మంత్రులు పల్కిన ఆర్ద్రవచనములు ప్రశంసార్హములు. అయితే అసలుసమస్యతీరితేనేగాని ప్రజాహృదయంలో చిచ్చు చల్లారదు. బంగాళంమాట అట్లావిడిస్తే-ఒక్క పంజాబులో 25000 మంది హిందూస్త్రీలు 12000 ముస్లిం స్త్రీలు ఈ విధంగా బందీకృతులైనారని గాంధీమహాత్ములు లెఖలుచెపుతున్నారు. ఇతరులపహరించినదానికన్నా తమవారపహరించినవారు తక్కువసంఖ్యఅని, అదీ ప్రతీకారంగానేయని-హిందువులుచెప్పడం మహాత్ముడు హర్షించడంలేదు. మహాత్ములహృదయం అలాంటిదే. అయితే ఆసన్నివేశం సామాన్యహృదయులు భరింపరానిదికదా! ధర్మరాజశిక్షితులైన-భీమార్జునులుసమేతూ ఘోరప్రమాణములచేయ నుద్రేకపరచిన సంవిధానమది. భీమునిచే-సోదరరక్తపానముచేయించిన పైశాచికోద్రేకమును రేపినదదే. వీరిలోకొలదిమంది మతాంతరులై, వివాహితులునై క్రుంగి కుళ్లిపోతున్నారని చెపుతున్నారు. శివ, శివా! అట్టిపనికి హిందువుడెవ్వడైనా పాల్పడిఉండునని తలంచుటకు మా మనసొప్పకున్నది-కేవలము తురకలకుబుద్ధివచ్చి-హిందూవనితలవిడుచుటకై-ముస్లింస్త్రీలను బందీలుగామాత్రముంచి-తల్లులవలె, సోదరీమణులవలె కాపాడుచున్నారని మాత్రమే తెలియుటకు మా హృదయ మువ్విళ్లూరుతున్నది. ఇలాంటి అభాగినులను కొందరను లాహోరక్యాంపుచేర్చగా వారిని స్వస్థానములకు చేర్చనవకాశములు చాలకున్నాయని కేంద్రశాసనసభలో శ్రీమతి సుచేత కృప్లానీచెప్పియుండెను. అట్లుచేర్చబడిన యువతులుకొందరు మాయమైరనియు మరియొక ఘోరవార్త ఆమెతెల్పెను వీరిలోకొందరు సిగ్గుతో క్రుంగిపోయి, 'ఏ మొగముపెట్టుకొని అత్తిండ్లకు, పుట్టిండ్లకువత్తు'మని రా నిరాకరిస్తున్నారట. గాంధీమహాత్ముడు వారు పవిత్రులనిపల్కి వారికభయమిస్తున్నాడు. "అహల్యా ద్రౌపతీ, సీతా, తారా, మండోదరీ తథా, పంచకన్యాస్మరే న్నిత్యం మహాపాతకనాశనం" అని ధ్యానశ్లోకముల పఠించు హిందువు డిట్టిఅభాగినులను పతితలని ఇంకను అవమానపరుపజాలడు. నేడుభయప్రభుత్వములు తీవ్ర కృషిసల్పి వీరందరిని స్వస్థలములచేర్చి స్వస్థచిత్తుల నొనర్పవలయును. ఈ పనిజరుగనిదే మిగతఅన్నివిధముల సమాధానమైనను హిందూ పాకిస్థానములకు పొందుకుదురుట అసాధ్యము.




మించుపల్లె:— తెలుగు పోలుపు: పద్యకృతి: కృతికర్త: శ్రీ నిడదవోలు వేంకటరావు గారు ఎమ్. ఏ., ఆంధ్రోపన్యాసకుడు, మద్రాసు విశ్వవిద్యాలయము. వెల రూ. 1/-

మాతృనిర్వేదము:—(నవాఖాలీ-అనంతరము) గ్రంథకర్త: శ్రీ భాగవతుల పూర్ణయ్య గారు ఎమ్. ఏ., దొరకుచోటు: తిక్కన గ్రంథమాల, పూనా. వెల రూ. 1-8-0.

చారుణి:—పద్యకృతి. గ్రంథకర్త: శ్రీ పాటిబండ మాధవశర్మగారు ఎం. ఏ. (ఆనర్సు) ప్రాప్తిస్థానము: శ్రీ బాబీ గురుకులము, బాబీనగర్, బెజవాడ. వెల రూ. 1/-

మహమ్మదీయ రాజ్యాల్లో జాతీయవికాసము: రచన: శ్రీ గొల్లపట్నం కొండయ్యగారు, వలయువారు: సంస్కృతి ప్రచురణలు, పెరంబూరు, మద్రాసు 11 అని వ్రాయగలరు. వెల రూ. 1-8-0.

ఆంధ్రమాత:—ఆంధ్రసాహిత్య సమితి, పూనా. మూల్యము 0-12-0.

ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక:—2 నెలల కొకసారి ప్రకటింపబడును. వలయువారు యీపత్రికా కార్యాలయము, కాకినాడ అని వ్రాయవలెను. సం॥ర చందా రూ 3-0-0.

ఆంధ్ర వాఙ్మయచరిత్ర:—శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు. నాగేశ్వర గ్రంథావళి. ప్రకాశకులు: ఆంధ్రగ్రంథమాల, తపాలాపెట్టె 212, మద్రాసు 1. వెల 2-0-0.

1. ఆపరేషను వైద్యము అను శల్యతంత్రము:—
2. కాయచికిత్స:—రచయితలు: డా॥ ముడుంబ దొడ్డయాచార్యులు, లక్ష్మీదేవిగార్లు. ప్రతులువలయువారు రచయితలు, కొవ్వూరు, ప॥ గో॥ జిల్లా అని వ్రాయగలరు. ఒక్కొక్కటి వెల రూ 2-0-0.

Printed and Published by Dr. S Seshagiri Rao, at the Lodhra Press, Kesari Kuteeram Ltd. 15, Westcott Road, Royapettah, Madras. Editor. Dr K. N. Kesari.